[illegible] సం॥ కు రూ. 3.  విడిసంచిక అ. ౮.





1921

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౧౦. { దుర్మతినామసంవత్సరము. మార్గశిర—ఫాల్గునమాసములు. } సంచిక ౫-౬.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౨.

# విషయసూచిక.

విషయములు. పుటలు.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

వికృతిసంవత్సరము

పదియసంపుటము.

# దుర్మతిసంవత్సరము

## దశమసంపుటము

### విషయసూచిక.

విషయసంఖ్య. | పుటసంఖ్య.

శ్రీ స్తు.

# ఖగోళమండలము.

పూర్వకాలమునుండియు హైందవపండితుల యభిప్రాయము లోకము లనేకములు గల వనియు, వానివానియందు వానికిఁ దగిన పురుషులు [illegible] యుఁ బోవుకొలఁది నరులకన్న మిన్నలగు వారె కాఁదగు ననియు [illegible] కానంబడుచున్నది. ఈలోకము లెందుఁ గల వని విచారింప ననసరము లేదు. నక్షత్రమండలాంతర్గతములై యున్న వని యాగ్రంథములయందె తెలియంబడును. ఇట్టియభిప్రాయ మెట్లు కలిగెనో, భౌతిక భూగర్భశాస్త్రములు తత్త్వ మరసి చెప్పిరో, లేక కేవలము భూగోళముతోఁ దక్కినవానికిఁ గలసామ్యముఁ బురస్కరించికొని యూహించిరో యిప్పుడు చెప్పుటకు వీలు లేదు. శాస్త్రజన్యజ్ఞాన మనుటకుఁ దగినయాధారములు లేకపోవుటచే నది కేవలము నూహామాత్రముగా నిశ్చయించినను, వారిబుద్ధిసూక్ష్మమునకు సాక్షీభూత మగుంగాక.

సాయంకాలము సూర్యుఁడు దిక్చక్రాగ్రము దరిసి బంగారువెల్లువ లోక మంతయు నింపి యనంతరము క్రమక్రమ[illegible]లోని పట్టుకుచ్చులఁ బోలె నాకాశమున వ్రేలుమేఘములు [illegible]పాదించి, యంతకంతకుఁ [illegible] గొనలుసాఁగి పడమటినుండి తూర్పునకు క్రొక్కచెంగావి మేలుకట్టు కట్టి రంగప్రదర్శనమునకు సూచనగఁ దెర దీయునట్లు యదియుఁ దొలఁగి ప్రతిదినము దోఁచు నద్భుతరామణీయకం బగు నక్షత్రప్రదర్శనము పక్వబుద్ధి యగువానికెల్ల సంతసముఁ గలిగించుచునె యున్నది. పొడవు, వెడల్పు, నగాధము, నెటు చూచిన నంతము లేని యానక్షత్రరాసుల నిదానించునప్పుడు గలుగు శాంతికి శాంతియె యుపమానమై హృదయస్పందనముచు వినఁబడ ననవచ్చును. అనాదినుండి నానక్షత్రములు తమతమ తావులం దప్పక స్థిరముగ నున్నట్లు గన్పట్టుచుండును. అయినను గొంచెము శ్రద్ధతోఁ బరిశీలించినచో నొకటి రెండు మాత్రము తక్కినచుక్కలప్రక్కఁ జరించుచుండుట స్పష్టమగును. ఇవియు నక్షత్రములకన్న పెద్దవిగఁ గాన్పింపని కారణమున నభ్యాసము లేనివానికి వాని నేర్పాటుగఁ దెలియుట కష్టము. ఒకటి రెండుమాఱులు చూచినతోడనే యిఁక నెవరిసాయ మవసరము లేదు. ఆవిధముగ స్థానచలనము గలచుక్కలఁ బరీక్షించినయెడల,

నవి యై దని తెలియవచ్చును. సంవత్సరమునందుఁ గొన్నినాళ్లు సూర్యాస్తమయ సమయమునను మఱికొన్నివేళల సూర్యోదయాత్పూర్వమునను జంద్రునివలెఁ దెల్లని వెన్నెలను గురియు మహాతేజోవంత మగుచుక్క యొకటి గాన్పించు చుండును. అదియె శుక్రుఁడు. శుక్రునియంతయు గొంచెము తక్కువయు తేజంబు గలిగియు నంతస్వచ్ఛముగ లేని మఱియొక చుక్క గన్పట్టు నదియె బృహస్పతి. శుక్రునకు బృహస్పతియె సమానము. బృహస్పతికి శుక్రుఁడె సమానము. సూర్యునకు భూకక్ష్యకు నంతరమున నుండు గ్రహములయం దెల్ల శుక్రుఁడె పెద్ద. ఆకక్ష్యకుఁ బైఁ గలకక్ష్యలయం దున్న గ్రహములయందె కాక గ్రహము లన్నిటియందును బెద్ద బృహస్పతి. కావుననె యధోనివాసు లగు దైత్యులకు నాచార్యుఁడు శుక్రుఁడు. ఊర్ధ్వలోకముల కాచార్యుఁడు బృహస్పతి. అది యట్లుండె. మఱియుఁ బరీక్షించిన నొకతెల్లనిచుక్క యొక్కటి కడుఁజిన్నది, కిరణశూన్యమై నట్లు గాన్పించు నదియె శని. శుక్రుఁడు దెల్లగఁ గనంబడునట్లు, సంవత్సరభాగముంబట్టి సూర్యోదయసూర్యాస్తమయముల నెఱ్ఱనిచుక్కయి యొకటి చూపట్టు. నదియె యంగారకుఁడు. ఇవి కాక మన కెన్నఁడో కాని కాన్పింపనిది బుధుఁ డనుగ్రహ మింకొకటి కలదు. ఈవిధముగ స్థానము మాఱు చుక్కలు గ్రహము లనియుఁ దక్కినవి నక్షత్రము లనియు వ్యవహరింతురు. ఈగ్రహములను బ్రతిదినముఁ బరీక్షించుచున్న నవి నానాఁట నక్షత్రమునుండి నక్షత్రమునకుఁ బోవుచున్నట్లు గాన్పించును. వీనిచలనమును బశ్చిమమునుండి తూర్పునకు, సూర్యసంచారపథమునందుఁ జూడవలయును. ఇట్లు గ్రహములు నక్షత్రములయందుఁ బశ్చిమమునునుండి తూర్పునకు నడుచుచుండుటవలన భూమియం దున్నమనకు నక్షత్రములును, వానియం దున్నగ్రహములు దూర్పుననుండి పశ్చిమమునకుఁ బోవుచున్నట్లు చూపట్టును. ప్రతిదిన మేదే నొకగ్రహముఁ బరీక్షగఁ జూచుచున్నచోఁ గొంతకాలము జరుగునరి కొకవిచిత్రము కనఁబడును. హఠాత్తుగా నొకనాఁ డెప్పుడో పశ్చిమముననుండి తూర్పునకు నడచుచున్న గ్రహము తూర్పునుండి పడమటికి వెనుకకు నడచుచున్నట్లు భ్రాంతికలుగును. అప్పుడు గ్రహము వక్రించె నందురు. గ్రహము లన్నిటికి నిట్టివక్రణము గలుగుచునె యుండును. మఱి కొంతకాలమునకు యథాపూర్వముగా వక్రించిన గ్రహము పశ్చిమమునుండి తూర్పునకు నడువ మొదలిడును.

మనము ప్రతిదినముఁ జూచు గ్రహములలో నంగారకుఁడు గురుఁడు శుక్రుఁడు ననునవి యెంతయు నాశ్లాఘనకరములు. కొన్నిసమయములందు సూర్యా

స్తమయ మైనకొంచెము సేపటికిఁ బడమట నెఱ్ఱఁగ గాలినబొగ్గునిప్పో యనునట్లు రక్త తేజోమయం బగునొక్క గ్రహము సూపనగు. అదియె యంగారకుఁడు. అంగారమువలె నెఱ్ఱగ నుండుటచేతనె దాని కాపేరు గలిగినట్లు స్పష్టముగఁ దెలియుచునె యున్నది. మఱికొన్నిసమయములం దాగ్రహమె సూర్యోదయమునకు ముం దొకటిరెండుగంటలవేళఁ గాన్పించుచుండును. మఱికొన్నిసమయముల సూర్యునితో సమముగ నుదయించుటచే, నస్తమించుటచే నది కనఁబడక పోయినఁ బోవచ్చు నట్టిచో నది యస్తంగతం బయ్యెనందురు. తక్కినగ్రహముల కన్న నీయంగారకగ్రహము తఱచు వక్రించుచుండుకారణమున దీనికి వక్రి యను నామము గూడఁ గలదు.

ప్రాచీనకాలము నుండియు దీనియెఱ్ఱంపునె మనంబులం దుండినది. ధూమమయం బగుదీపికా తేజము గలదగుట నీగ్రహం బనేకయుగ్రరోగములకు మశూచి వ్రణములు యుద్ధములు మొదలగుబాధలకుఁ గారకుండని నిర్దేశించిరి. అదియుంగాక, యీగ్రహము, మరుప్రదేశములఁ బర్వతారణ్యముల సూచించు నని చెప్పిరి. ఐన నిం కొకవిశేషము గలదు. అంగారకునకు క్షేత్రకారకత్వ మారోపించుటయుఁ దత్క్షేత్రంబు లని వాడుచున్న మేష వృశ్చికంబులు పర్వతారణ్యతలంబుల నొకటియుఁ గొంచెము జలముగల తేమనేల నొకటియు సూచించునట్లుఁ జెప్పుటకుఁ గలకారణము విచారింపవలయు. ఈవిషయము లన్నియు మనము ముందు పరింపఁబోవు కేవలప్రత్యక్షపరీక్షచేఁ దెలిసిన విషయములకుఁ జాల సంబంధము గలిగియుండుటచే నవి, జాతకభాగములోని వయ్యు సిద్ధాంతములోనికిఁ దేవలసివచ్చినది. పైఁ జెప్పఁబడిన దానింబట్టి యంగారకగ్రహము స్థలమయుంబను నభిప్రాయము ప్రాచీనులకుఁ గలిగియుండుట దెలియవచ్చును. ఇట్టియభిప్రాయము వారి కెట్టిప్రమాణములంబట్టి కలిగినదియుఁ జెప్పుటకుఁ దగునాధారములు లేవనియుఁ గేవలము బుద్ధిసూక్ష్మతయె వారి యాధార మనియుఁ బైనఁ జెప్పియుంటిమి. ఇది బాగుగ జ్ఞాపక ముంచుకొనవలయు.

సామాన్యముగా నేయంత్రసహాయములేక కంటితోడనె యంగారకుని బరీక్షించుచుంటిమేని యొకానొకప్పు డది శుక్రునియంత పెద్దదిగను మఱియొకప్పుడు నక్షత్రములతో సమానముగాఁ జిన్నదిగను గన్పించును. ౧౯౨౦ సంవత్సరము జనేవరినెలలోఁ జూడ నట్లు పెద్దదిగఁ గాన్పించి యానవంబరునెలయందును దరువాతను మిక్కిలిచిన్నదిగఁ గాన్పించినది. దీనికిఁ గారణ మాకాలమున

నది భూమికిఁ జేరువగ నుండుటయు నిప్పుడు దూరముగ నుండుటయు నని తెలియవలయును.

భూమికి నొకానొకప్పు డిది చేరువగ వచ్చుచుండుటయు నొకానొకప్పుడు దూరమునకుఁ బోవుచుండుటయుంబట్టి యంత్రశోధన కొకప్పు డనుకూలముగ నుండుటయు మఱియొకప్పుడు లేకయుండుటయుఁ దటస్థించుచుండును. కాని భూమికి మిక్కిలి సమీపమునకు వచ్చినప్పుడు భౌమగ్రహము వేధించినట్లు మఱే యేగ్రహము వేధించుటకు వీలుగలుగదు. అట్టి సమయములం దొకపాటి దూరదర్శినిం బెట్టి చూచినచోఁ మంచి చిత్రముం జూడవచ్చును. నట్టికంటితోఁ జూచినప్పటి కీ [illegible] యందు నంగారకగ్రహ మెఱ్ఱగనె గాన్పించును గాని కేవల మెఱుపుకు గ్రహము కాక కొన్నితావులం దెఱ్ఱగను గొన్నితావులందు నల్లగను గాన్పించును. మొత్తమునకు నెఱుపె యెక్కువ స్ఫుటముగ నుండుటఁ గంటఁ జూచునపు డెఱ్ఱగ దోఁచును. ఆ యెఱుపుమచ్చలను నల్లమచ్చలను గొంతకాలమునకుఁ జూచుచుండిన నవి కదలుచున్నట్లు స్ఫురించును. మఱియుఁ గను పెట్టికొని యున్న మచ్చతరువాత మచ్చ కుడినుండి యెడమకుఁ దిరిగి పోవుచుండును. ఇంకను బరీక్షించినఁ జివరకు వచ్చినమచ్చయే మరల వరుసవెంబడి రా మొదలుపెట్టును. దీనింబట్టి యంగారకగోళము భూగోళమువలెఁ దిరుగుచున్నట్లును, మనము చూచునది యేమేఘములో మఱియే యుదార్థములో గాక స్థలనిర్దేశము గలశాశ్వతభాగముల నిశ్చయము తేలును. మఱియు నీమచ్చ లొకమాఱు గనఁబడి తిరిగి కనఁబడుటకుఁ గల యంతరము దెలియుటవలన నంగారకగోళము తిరుగుటకుఁ బట్టుకాలము గణింపవచ్చును. అట్టి శోధనలవలన నంగారకమండల మిరువదినాలుగుగంటలు ముప్పదేడు నిముషములు నిరువదిమూఁడు సెకనుల కొకమాఱు తిరుగు నని తెలిసినది. కావున నంగారకమండలమునందున్నను మనలోకమునందునయైన యహోరాత్రప్రమాణమునఁ గొంచెమేనియు భేదము గలుగదు. ఐన నది సూర్యునియొద్దనుండి భూమికన్న నెక్కువదూరముగ నుండుటవలనఁ బవల్లయం దింతయెండ యుండదు రాత్రులం దింతకన్న నెక్కువ చీఁకటిగ నుండవచ్చును. సూర్యునికి దూరముం దున్నను, భూకక్ష్యకుఁ బైఁగల గ్రహములకు దగ్గఱనుండుటవలన వానివెలుఁ గొకకొంత సదుపాయమున నుండవచ్చును. అంగారకదినప్రమాణము మానవదినసతుల్యమె యనుటచే సంవత్సరము నట్లయుండు ననుకొనదురా అంగారకుఁడు సూర్యునిచుట్టు దిరుగుమార్గము భూమితిరుగుదానికన్నఁ

గించిదూనమున రెండింత లగుటచే నంగారకవత్సరము మనసంవత్సరములు రెండింటికి సమాన మగును. నిజముగా మనవాసరము లాఱునందలు నెనుబదియే డైన నొక్క భౌమసంవత్సరం బగును. మన యీ యాఱునందలు నెనుబదియేడుదినములు నాఱునందలు నఱువదితొమ్మిది యంగారకదినంబు లగు ననిన మానవదినంబునకు భౌమదినంబునకుం గల వ్యత్యాస మెంతస్వల్పమొ యూహింపవచ్చును.

దూరదర్శిని యంత్రముచే నంగారకబింబము శోధించిన దానివ్యాస మైదువేలమైళ్లుపొడవున్నట్లు తేలుచున్నది. దీనింబట్టి యంగారకగోళవైశాల్యముకన్న భూతలంబు రెండున్నరరెట్లున్నట్లు గణితసిద్ధ మగుచున్నది. మఱియు సూర్యునొద్దనుండి దానిదూరముంబట్టియుఁ, బదార్థముంబట్టియు, నాగోళమునందు మనలోకములోని వస్తువు లన్నియు సగముతూఁగునట్లు గనంబడును. మఱియు, వస్తువులతూనిక భూమి యాయావస్తువుల నాకర్షించు శక్తిం గొలుచు ప్రమాణము లైనయట్లు, యంగారకగోళమున నాయావస్తువులభారము భౌమగ్రహ మాయావస్తువుల నాకర్షించుశక్తికిం గుఱుతగుంగావున నాశక్తి భూమికిం గలశక్తియం దర్ధంబై యుండును. ఈకారణమునను యాలోకమున వృక్షము లుండుట సంభవించునేని యవి భూలోకములోని చెట్లకన్న రెండింత లెక్కువ యెత్తుపరుం బెరుఁగును.

అంగారకబింబ మక్షంబునం జూచిన ధ్రువప్రదేశములు హిమావృతంబులుగా నంబడు నని నేర్చికొని యుంటిమి. అది యేమైనదియుఁ జర్చించుటకుఁ బూర్వము వే ఱొకచిత్రము గనంబడును. బింబమున కూర్ధ్వాగ్రమునం దొక తెల్లనిమచ్చ కానిపించును. మనభూమిని విమానమందు బహుదూరముననుండి యెవరైనఁ జూచిరేని సంతతహిమావృతంబు లైనధ్రువంబులు నావిధంబుననె గనంబడును. ఈసామ్యముంబట్టి యదియు భౌమమండలధ్రువం బగునని యనుమేయింపవచ్చును. పండితులంద ఱీవిషయంబున నేకాభిప్రాయమె కలిగియున్న నాధ్రువప్రాంతశ్వేతపదార్థ మేమైనదియు నిశ్చయింప సంకోచించువారలుం గలరు. కొందఱది హిమంబె యనియుఁ, గొందఱు ఘనీభవించిన యంగారామ్లవాయు* వనియు వాదించుచున్నారు. కాని యాశ్వేతపదార్థము క్రమక్రమముగాఁ గరఁగి నీలంబగువలయంబు యంత్రంబునం గనంబడుటం జేసియుఁ, దద్వలయము శ్వేతప్రదేశాగ్రము వెంబడి వ్యాపించుచుండుటంబట్టియు, నంగారా

* దీనినె బొగ్గుపులుసుగాలి యని ప్రాఁతయారోగ్యశాస్త్రముల వాడిరి.

ష్ణువాయు వా తెఱంగున నట్టిస్థితిగతుల ద్రవత్వము సెందక యే యావిరి యగునను న్నిదర్శనముంబట్టియుఁ దెలుపు మంచనియు, నీలవలయము జలంబనియు సిద్ధాంతము సేయుటకు నేయభ్యంతరము గలుగరాదు. మఱియుఁ గొన్ని నాళ్లుచనుటయు నుత్తరాగ్రమునఁ గన్పించిన తెల్ల క్రమక్రమముగా మాటువడి యీవరి దక్షిణాంబున దృక్పథంబునం బడును. ఇప్పు డుత్తరధ్రువము వెనుకకుఁ బోయి దక్షిణ ధ్రువము మనవైపునకుఁ దిరిగినది. భౌమమండలధ్రువంబు లేర్పడినతోడనే సూర్యునివైపున కామండలాక్ష మెంత యొఱగియున్నదియు స్పష్టమగును. అట్లు శోధించి భౌమగోళము సూర్యునివైపునకు నిరువదినాల్గుభాగ లొఱగియుండుటఁ గనుఁగొనిరి. భూమి యిరువదిమూఁడుభాగ లొరగియున్నది. రెండును బోల్చినఁ బరస్పరముఁ గలసామ్యము తెల్లమె. భూమి సూర్యునివైపున కొరగి యుండుటంబట్టియే ఋతుభేదములు కలుగుచున్నవి. యంగారకగోళమునుం గొంచె మించుమించుగ భూమియంతయె యొరగియున్నందున నచ్చటి ఋతువ్యవస్థ భూమండల ఋతుక్రమంబె యగును. ఐన నంగారకవత్సరము మానవవర్షమునకు ద్విగుణము గావున నాలోకమునందుఁ బ్రతిఋతువు మనఋతువునకు రెండింత లుండును. సామాన్యముగ భూమండలమున ఋతువు లన్నియు సమానములు. మకరసంక్రమణము మొదలు మేషపర్యంతముఁ గలశీతకాలమును, మేషము మొదలు కర్కటకమువఱకు, నచ్చటి నుండి తులవఱకును, నందుండి తిరిగి మకరపర్యంతముం గలఖండచతుష్టయముఁ గొంచె మించుమించుగ సమప్రమాణములె యై యున్నవి. అంతేకాక శీతకాలమునందు, అనఁగా, మకరసంక్రమణమునకు భూమి సూర్యున కతిసమీపముననుండి దక్షిణార్ధమునకు గ్రీష్మారంభ మగుటవలనను మఱి యప్పుడె భూమి యతిశీఘ్రముగఁ జరించుటచే నందుఁ గలవారికి వేసవికాల ముగ్రమయ్యు హ్రస్వపరిమితం బై యున్నది. ఆవిధముగనే యంగారకలోకమందును దక్షిణార్ధమునను వేసవికాలమగునపు డాగోళము సూర్యుని కతిసమీపమున నుండును. భూమండలమున దక్షిణార్ధవాసులకు వేసవియెండ లెక్కువగ నుండునట్లె భౌమవాసులకు దక్షిణార్ధమున వేసవియెండ లెక్కువై వేసవికాలము హ్రస్వమై యుండును. ఉత్తరార్ధమునందు మకరసంక్రమణము మొదలు మేషపర్యంతము నూటయేఁబదియెనిమిది దినములును, మేషము మొదలు కర్కాటకముదనుక నూటతొంబదితొమ్మిది దినములును, కర్కాటకము మొదలు తులాసంక్రమణమువఱకు నూటయెనుబదిమూఁడుదినములును, దులాది మకరాంతము నూటనలువదేడుదిన

ములుం గలసి ఋతుచక్రము పూర్తియగుసరికి షూనవమాసంబున నాఱువందలు నెనుబదేడు దినంబులుగా నంగారకసంవత్సరము వర్తిల్లుచున్నది. ఉత్తరార్ధమున గ్రీష్మ మగుడు దక్షిణమున శీతంబును, నందు వసంతమ్మగునెడ నిందు హేమంతంబును నందు శీతం బగునెడ నిందు గ్రీష్మంబును, నందు హేమంతం బగుచో నిందు వసంతంబు నగుచు మొత్తమునకు సంవత్సరము పూర్తియగును. కావున నుత్తరార్ధమునకు వేసవి నూటయెనుబదిమూఁడు దినములు, దక్షిణమునకు నూటయేఁబదియెనిమిది.

ఈశీతాతపకాలంబులం గలవ్యత్యాసములంబట్టి శీతంబున గాలి యందున్న యావిరియంతయు హిమస్వరూపముం బొంది ధ్రువప్రాంతహిమప్రదేశము వృద్ధిపొందుచుండును. మఱియు వేసవి సనుదేర నుగ్రం బగునాతపంబు చే నదికరఁగి ద్రవత్వము చెందుచుండును. భూగోళధ్రువంబులం దీవిధంబున శీతకాల మాఱుమాసములు మంచు పెరుఁగుచుండుటయు, వేసవియాఱుమాసములది కొంత కరఁగుచుండుటయు సంభవించును, కాని, ధ్రువప్రాంత మెన్నండు మంచులేక స్వచ్ఛముగ నుండదు. మఱియు భూమండలమున నుత్తరార్ధమునందు శీతవాతములును హిమప్రదేశములు నింగ్లాండు పర్యంతమును వ్యాపించుచుండును. దక్షిణార్ధమునందన్ననో యవి యంతదూరమునకు రావు. అంగారకలోకమందునీవిధమునసె హిమప్రదేశముల పరిమాణములు ధ్రువద్వయంబులకు భేదములుగ నున్నవి. ఉత్తరార్ధమున వేసవికాలము చాలదినములుండుటయు శీతకాలమునఁ దక్కువగుటయుఁ బట్టి చూడ నందు హిమప్రదేశము స్వల్పముగ నుండఁబోలు నని యూహింప నవకాశము కలదు. ఆవిధముగనే దక్షిణార్ధమున వేసవి స్వల్పమై శీతకాలము చాలదినము లుండుట వలన నచ్చట హిమప్రదేశ మతివ్యాప్తముగ నుండవలయు. ఐన నట్లుండక దక్షిణభాగమందు వేసవి యత్యుగ్ర మగుకారణమున హిమం బంతవ్యాప్తముగ గానంబడదు. సరిగదా, ౧౮౯౮ సంవత్సరమునందు భౌమమండలగ్రీష్మకాలమున దక్షిణధ్రువమున మంచే లేకపోయెను. ఆసంవత్సరమున నంగారకలోకమునందు వేసవికాల మత్యుగ్రమై యుండియుండవలయును. అంతేకాక వేసవి యెండలు సామాన్యముకన్న గొంచె మెక్కువైనంతమాత్రమున మంచంతయు హరించిపోవుట చూడ నిశ్చయముగా నచ్చటఁ గలమంచు స్వల్పమాత్రమై యుండవలయు నని గ్రహింపవచ్చును. భూమండలమునందువలెనే భౌమగోళమునందు ధ్రువప్రాంత సముద్రజలము ఘనార్ద్రమై యుండును. ధ్రువప్రదేశ

మింకను బరిశీలించిన నందుఁ బెద్దపెద్ద బీటలు చూపనగును. ఇవి ప్రతిసంవత్సరము మాఱక వచ్చినచోటనే తిరిగి వచ్చుచున్నట్లు కనుపట్టును, కావున నవి మంచుపగులుట వలన నేర్పడినవి కావు. ఎన్నియో లక్షలమైళ్లదూరమునకుఁ గానిపించుచున్నవి కాన నెక్కువ వెడల్పు గలిగియుండవలయును.

ధ్రువఖండముల సన్నిధియందుఁ జూచినతోడనే కనఁబడునవి తెల్లనిధ్రువంబులు గాన నవి యేమైనది ముందుగ నేర్చుకొంటిమి. బింబ మింకను బరిశీలించిన నల్లనిప్రదేశములు గొన్నియు ధూసరప్రదేశములు గొన్నియుఁ గనంబడును. సామాన్యముగ నంగారకమండల మెఱ్ఱగఁ గనఁబడుటకుఁ గారణ మీ ధూసరప్రదేశబాహుళ్యమే.

ప్రపంచమం దనుభవమువలన స్థలభాగములు నానావర్ణములు గలవిగను జలభాగములు నీలములుగ నుండుటంబట్టి పండితు లానల్లనిప్రదేశములు సముద్రము లని చెప్పిరి. వెనుకటికిఁ జంద్రబింబమునఁ గలనల్ల నీవిధముగనే సముద్రము లనుకొనియుఁ జివర కవి సముద్రములు గాక పోయెను. ఇం దైన నటులె సంభవించె నని ముందుముందు దెలిసికొనఁగలము.

కషాయతేజస్సమన్వితము లగునీప్రదేశములఁ బరీక్షించుకొలఁది నందు నల్లనిరేఖలు గనఁబడు. ఇవి యొకసముద్రమునుండి మఱియొకసముద్రము వఱకు వ్యాపించియున్నవి కాన మొట్టమొదట వీనిని గనుఁగొన్నవార లవి జలసంధు లని చెప్పిరి. యంత్రసహాయము బలమైనకొలఁదిఁ గ్రొత్తక్రొత్త జలసంధులు చూచుచువచ్చిరి. అంతేకాక యివి యం దం దగ్గదిగ్గముగ నొకదానినొకటి కలియుచు వచ్చినవి. ఆవిధముగఁ గలిసినప్రదేశములయందుఁ బెద్దపెద్ద గుండ్రని మచ్చలు నల్లగఁ గాన్పించుచువచ్చెను. ఈగుండ్రని మచ్చలు చెఱువులను భ్రాంతి కలిగెను. అది యట్లుండ నీజలసంధు లన్నియుఁ బైని మనము తెలిసికొనియున్న ధ్రువప్రాంతమందలి పెద్దబీటల నుండి బయలుదేఱినట్లు స్పష్టపడుచుండెను. ఈసంధులు నవియున్న స్థలభాగములవలెనే స్థిరములై కనుపట్టును. ఒకానొకసంవత్సరమునం దొకతావునఁ గనఁబడిన కాలువ మఱియొకసంవత్సరమున గనఁబడకున్నను గనఁబడునప్పుడు మాత్రము వెనుక గనఁబడినచోటనే యుండును. దీనింబట్టి గోళమం దంతట నెం దెం దెన్నికాలువ లున్నదియును బటంబులఁ జిత్రించిరి. అంతేకాక రానురాను ఛాయాపటములును దీసిరి. అన్నిటిం బరిశీలించి చూచిన నీకాలువలు కొంచెమేనియు వంకర లేక ధ్రువప్రాంతములనుండి తిన్నగ మధ్యభాగమునకు దిగుచున్నవి. ఒక్కొక్క

కాలువయు ధ్రువమునుండి ధ్రువమునకు వ్యాపించు రేఖ వంటి యున్నట్లు చెప్పవచ్చును. దీనింబట్టి కాలువ లెంతెంత దీర్ఘములైనవియుఁ జెప్పకయె తెలియుచున్నది. యంత్రసహాయమున వీని వెడల్పుంగూడఁ గొలిచి చూడఁ గొన్ని రెండేసివందలుమైళ్లవెడ ల్పున్నట్లు చెప్పుచున్నారు.

మొదమొదటివారు కీకాలువ లన్నవి స్థలభాగములందె యున్నవని యందఱు ననుకొనిరి కాని చివరకు నల్లని మచ్చలయందును నైతము వ్యాపించి యున్నట్లు తెలిసెను. ఇందును గాలువలు సమగ్రసరళరేఖలె. ఐన నొక్కొక్క నల్లనిమచ్చ వంచయం దొకబిందువునుండి యంటుఁగల కాలువ లన్నియు బయలుదేఱునట్లు గన్పించును. దీనినిబట్టి యీనల్లని ప్రదేశములు జలభాగములు గావనియు నవియు స్థలభాగములె యనియు, నేకారణముచేతనో నల్లగఁ గన్పించుననియు, నంగారకబింబ మంతయు స్థలభాగమే కాని జలభాగము కా దనియు నున్నజలభాగము ధ్రువప్రాంతములనే కల దనియు సిద్ధాంతము చేయవలసి వచ్చెను.

అద్దమున మొదటఁ జూడఁబోవునపు డేమి చూచునదియుఁ, జూచునది వాస్తవాకృతి యగునదియుఁ గానిదియు తెలియని సంశయమునఁ గాలువల గుర్తింపలేకున్న నొకపూఁటు చూచి విశ్వాసమునఁ జూచువానికి నల్పప్రయత్నమునవె యాఘాతములోకమందలి గూఢచిత్రము లన్నియు స్పష్టముగఁ గన్పించును. ప్రారంభమున రక్తప్రదేశములందలి కాలువలె నప్పుకపోయిరి. చూడఁ జూడ వాని నిజము దెలిసి యెన్నికాలువలుగలవో యెంతెంత పొడవుగలవో శోధింప నారంభించునరికి ఛాయాంతప్రదేశములందునైనను గాలువలు గన్పించెను. ఈనూతనవిశేషము నరయుచుండఁగ నందఱు గణితవేత్తలు కాలువలు గొంచెము విస్తృతము లగుచుండుటయు, విస్తృతము లగువానిప్రక్కనె వానికి సముఖముగ* వానియంతంత కాలువలు గన్పించుచుండుటయుఁ జూచిరి. ఇది మిక్కిలి యద్భుతము. కాలువ లొక్కొక్కటె కాక జంటలుగఁ గూడనున్నవి. ఒక్కొక్కసంవత్సరమున జంటలో నొకకాలువ నల్లగ స్పష్టముగఁ గాన్పించును. ఒకటి నల్లగ నున్న రెండవది తేలికగఁ దోఁచును. అది తేలికగనున్న నిది గాఢముగఁ దోఁచును. ఈజంట కాలువలు రక్తప్రదేశములందును ఛాయాంతలములందును వ్యాపించి యున్నవి. ఈజంటలందుఁ గొన్ని మహాదీర్ఘములు. కొన్ని స్థానికమాత్రములు. ఐన నివి విస్తారముగ గోళమధ్యభాగమున నలువది డైవంశల యంతరమునందుఁ జూడఁదగును.

* సముఖరేఖ యనగ సమానాంతర రేఖ.

మఱియు నెట్టియేర్పాటులవలన నౌకవాహిని విసర్జ్యమైన రెండవది పురికొనుచున్నదో యొకటి పురికొనిన రెండవది విసర్జ్యమగుచున్నదో యింకను బండితులకుఁ దిన్నగ బోధపడినదికాదు. ఈవిషయమై శోధింప శోధింప సాగరసంగమప్రాంతమున మననదులు పాయలుగఁ జీలి యొకదానిశాఖ లొకదానితోఁ గలసి రెండింటికి నభేదం బైనరీతిఁ గొన్నియెడలను, గొన్నియెడల శిలీముఖముఖాకృతులైన ములుకులతో సగ్రము లేర్పడుచున్నట్లును సువ్యక్తమయ్యెను. సర్వసామాన్యముగా నౌకసారిణిద్వయము ఉక్తప్రదేశమునుండి ఛాయాతలంబునకు సంక్రమింపవలయునేని నిట్టిములికి యాతమస్థలసీమంబునఁ దప్పక చూడనగు. ఈములుకులు నిజముగా సృష్టియందె యున్న వగునేని నన్నియు నేకాకృతిగ నె[illegible]వు? ఒకస్థలంబునకు నొకస్థలంబునకు వ్యచ్ఛిలావన్యశిలోచ్ఛయా[illegible]ది ప్రకృతిపరిసరంబులుం బరికరంబులు మాఱుచుండుంగావున నన్నియు [illegible] నేకాకృతులై యున్నవుడు కృత్రిమనిర్మాణంబు లనుమేయించుట సాహసం బనంజన్నదు. ఏది యెటులున్న నీయుగ్మసారిణులు ఖండమధ్యభాగమునందె విశేషముగ నుండుటయు ధృవాభిముఖముగఁ బోవుకొలఁది సన్నగిలుచుటయు స్పష్టముగఁ గన్పించుచున్నది. కాని గోళము మధ్యభాగమునందు రెండుసమాంతరవలయములు రచించిన వానిమధ్యమున నుండు గోళఖండము తక్కుంగల యేభాగమున రచించిన తుల్యవలయముల మధ్యమునుండు ఖండములకన్న నెక్కుడగు ననునది కేవల స్థూల[illegible] బోధపడును. మధ్యఖండమున వైశాల్య మెక్కువ. వైశాల్యమెక్కు[illegible]నకు నాడీసంఖ్యయు ననురూపముగనె యెక్కువ. ఇదియు వాహి[illegible] కృత్రిమనిర్మితము లని సూచించుచున్నది. ఇంతవఱకు వాహినులు ధ్రువ[illegible]రాంతరరేఖలవంటి యస్థిరరేఖాశాస్త్ర ప్రసక్తిఁ జూపుచుండుట నెఱిఁగియుంటిమి కాని దానికిఁదోడుగ నిపుడు వానియందు దేశోచిత విభాగవ్యవస్థయుఁ జూపట్టును. ఈనిదర్శనము లన్నిటింబట్టి వాహినులు నిశ్చయముగ మేధావినిర్మితము లని యూహింపవలయు.

వాహినులు మేధావిరచితము లని యొప్పికొనినంతనె వానివాని ప్రమాణములు కొలిచినకొలఁది నద్భుతం బగుచున్నవి. వాహినుల యథార్థస్వరూపముఁ దెలియవలయునను వాంఛయు నెక్కువగుచున్నది. ఈవాహినులకన్నిటికిని జన్మము ధ్రువప్రాంతహిమం బని యొకయూహ చేసితిమి కద. ధ్రువప్రాంతహిమం బైనచో నది వేసవివచ్చినఁగాని కరఁగదు. కరఁగినఁగాని జలము

లేదు. జలములేనప్పుడు వాహినులు పైకిఁ గాన్పింపవు. ధ్రువప్రాంతములకు సరియైన వేసవి వచ్చినంతనె హిమములు కరుఁగనారంభించి క్రమక్రమంబుగా జలము గోళమధ్యమునకు వ్యాపింపం గాలువలు ధ్రువమునుండి దిగువకు నలుపెక్కుచుండుట శోధనావిచక్షణుల చక్షురుపకరణంబులకు గ్రాహ్యంబులై యుండవలయు. ఈవాదము పురస్కరించికొని కాలువలు శోధింప నారంభించుటయు వాని వాస్తవము మఱింత బాగుగఁ దెలియవచ్చును.

భూమండలమందుంబలె నంగారకగోళమందును వసంతాదిఋతువ్యవస్థ సూర్యమండలమునుండి గోళదూరముంబట్టి కలుగుచుండు ననియు, భౌమలోకమందును భూలోకమునందుంబలెనె క్రమంబుగ వర్తిల్లుచున్న వనియు నేర్చుకొంటిమి. ఇక, వసంతకాల మనునది గోళగ్రహము క్రమక్రమముగా సూర్యునివైపు దిరుగుట వలనఁ గలుగుచున్నది కాన విషువత్ప్రాంతదేశముల నది ప్రారంభించి నాలుగుమాసములకు గోళోర్ధ్వభాగముఁ జేరుచున్నది. వసంతారంభ మైనవంతనె పచ్చని కలములును, శాద్వలములును వృక్షములును క్రమక్రమముగాఁ దలయెత్త నారంభించి నేలయందెల్లయు వింతకాంతులు మించుట స్ఫురించును. మనలోకమున వసంతాగమము మైనమునుండి యెవరేని శోధించుచుండురేని యట్టివారు భూమండలము మధ్యభాగమునుండి ధ్రువప్రాంతములకు వరుసగాఁ బచ్చరంగులు ప్రసరించుటయు, దానికి రెండవప్రక్క నటులె ధ్రువంబునుండి మధ్యఖండమునకును నన్నె తెఱుఁగు వ్యాపించుటయు విస్పష్టంబుగఁ జూడఁగలరు. ఆవిధముగనె యంగారకమండలమునందును నానాదేశవసంతాగమము దుర్భిణీకాచదండంబున మనము జూడ శక్తులమై యుండవలయు.

నిజమునకుఁ గనంబడుచునె యున్నది విషువత్సీమ వసంతారంభ మైనంతనె యాప్రాంతంబునందలి ఛాయాతలంబులన్నియు మఱింత నిగనిగలాడుచుఁ గాన్పించుచున్నవి. వానియందగపడు కాలువలన్నియు మఱింత స్పష్టములై తోఁచును. అట్లు ప్రారంభించి కొంతకాల మగునరికి యావలిసగమునఁ గాలువలు వివర్ణములుగా మొదలిడును. తరువాత వరుసవెంబడి విషువదూర్ధ్వ సారిణు లన్నియు ధ్రువమువఱకు నలుపెక్కుచుండును. క్రిందివన్నియుఁ దెల్లఁబాఱును. అంతేకాక యీనూతనవసంతారంభమునఁ గొన్నిసమయములం దొకనాఁడు పచ్చగఁ గాన్పించిన భాగములు మఱునాఁడు హఠాత్తుగఁ దెల్లవడిపోవును. మఱియు నొకానొకప్పుడు చాలకాలమునుండి తెల్లగనున్న పొడలు పచ్చబాఱును. ఈవ్యత్యాసములు గలుగుటకుఁ గారణ మూహింపవలయు.

ఈలక్షణములు వృక్షసముదాయములకుఁ బట్టును. మొలకలపైఁ గప్పిన మంచు, దక్షిణభాగములకన్న ముందు కరఁగును. పైవేఁడిమి కొంత హెచ్చిన తోడనె వృక్షసంపర్కము గలమంచు శీఘ్రముగ విడిపోవును. అంతేకాని పచ్చగ నున్నస్థలము హఠాత్తుగఁ దెల్లవడి మఱునాఁడు నల్లనవలయు నన్న నది జలప్రదేశము కాఁజాలదు. జలమే ఘనీభవించిన నామంచుగడ్డ యంత శీఘ్రముగఁ గరఁగదని ప్రకృతిపరిచయము గలవారందఱకుఁ దెలిసినవిషయమె. పండితు లనేకు లీసారెలు వృద్ధిక్షయములఁ బరిశీలించుపూనిక వారువారు వేధించిన యంతవఱ్ఱునకు వసంతారంభాది దినసంఖ్యలను సారిణీసీలిమాసాంద్రతలను పాదకక్ష* లంబకక్ష†లుగా గ్రహించి రేఖానుబింబనము‡ గావించి చూడఁ గాలువలన్నియు గోళమధ్యమునుండి యుత్తరమునకును యెక్కుసటులు తేలినది. అదేవిధముగ దక్షిణార్ధమునందును వసంతారంభ మగునెడ విషువద్దేశము లారంభించి క్రమక్రమముగా గోళమంతలి కాలువ లన్నియు గాఢంబులగును. ఇటువంటి శోధనలవలనఁ గాలువలన్నవి నిజముగు కాలువలు గావనియు, నవి వృక్షములు మొక్కలు పైరులు మొదలగువాని వచ్ఛేదనములవలన నటులు గాన్పించుచున్నవనియు, వీనివృద్ధికి ధృవప్రాంతహిమము మాధారమై యున్నదనియు, నాధ్రువజలము చేఁ బోషింపఁబడు కాలువలు గోళమందు నానా ముఖములకు వ్యాపించియుండ నాప్రవాహముల కిరుగడల సస్యాభివృద్ధి కలుగుచున్న దనియు, నిందువలననె యాయానీలప్రదేశముల విస్తృతి యొక్కొకచో నందలకొలఁదిమైళ్లున్న దనియు నూహింపవలసి వచ్చినది.

అంగారకమండలమున నిటులు సస్యాభివృద్ధి సూచితమైనందున, నందుల, నందెన్నఁడైన వర్షములు కురియుచున్నవా? మేఘములు గలవా? భూమియందువలె నందును సూర్యరశ్మిచే జల మావిరియై పైకి లేచుచున్నదా? అందును భూమియందువలె గాలి కలదా? నీరు, గాలి, వర్షము, సస్యము నున్నట్లైనఁ బ్రాణిలోకమునుం గలదా? యనుప్రశ్న లన్నియు మనస్సునఁ బొడముచు పండితు లనేకు లీయర్థము సాధించుటకు యత్నములు గావించియే యున్నారు.

అప్పుడప్పుడు దుర్భిణీయంత్రములందుసైతె మంగారకమండలోపరితలవ నేపథ్యాంతర్గతంబైనట్లు మసగమసగ గాన్పించుచుఁ, నొకటిరెండుదినముల వఱనారీతి నెయుండుచు వచ్చుచున్నందున మేఘములు గలవను ననుమానముగద్దె; అంతేకాక యొకానొకప్పు డొకనాఁడు స్వచ్ఛముగ నున్నభాగములందు మ

* x Co-ordinate. † y Co-ordinate ‡ Graphical representation.

నాఁడు తెలుపు బయలుదేఱుచుండుటవలన నింగ్లాండు మొదలగు శీతలదేశము లందు వలె మంచు కురిసి బహుక్రోశముల పర్యంతము గప్పివైచుచుండునటు లూహింపవలయును. కావున మేఘములు నావిరియు నంగారకమండలమునఁ గలవనియు, నందుఁ దిగ్మము* తక్కువగుటచే నది యేమాత్రము పడిపోయినను దక్షణమే యావిరి వర్షరూపమునఁ బడక హిమత్వముఁ జెందుననియుఁ బైకన్పించు విశేషముల కర్థము సేయవలసి యున్నది. మేఘములు గల వనియు హిమము వర్షించుచున్న దనియు స్ఫురించినంతనే, యందు వాయుప్రచారములు గలవని చెప్పితీరవలయు. గాలియే లేనియెడల గోళోపరితలము నం దేర్పడిన ధూమము పైకెగయలేక మేఘములై యుండవు. మేఘములై లేనియెడల వర్షము గురియు చుండుటయు, నతిశీతలంబులగు ధ్రువప్రాంతములఁ బ్రతివత్సరము హిమంబు పేరుకొనుచుండుటయు సంభవింపవు.

అంగారకలోకమున వాయుప్రచారములు గలవు గావున, భూమిపై నున్న వాతావరణము పదార్థములన్నిటిపై నొత్తుచున్నట్లులె యచ్చట గూడ నొత్తు చుండవలయు. ఐన వాయుపీడనము మాత్రము మనలోకమునం దున్నంత యుండ దని నిశ్చయింపవచ్చును. భౌమాకర్షణము భూమ్యాకర్షణమందు సగంబగుట వలన నుద్దిష్టప్రమాణంబగు వాయువు భూమియందుండు భారమున సగంబె యగు. అందువలన వాయుసాంద్రత తగ్గి దానిచేఁ గల్గుపీడనమును దగ్గును. వాయుపీడనము తగ్గునంతనె జలము సులభముగ నావిరి యగును. సూర్య రశ్మియు వేఁడి విశేషము తగ్గక యచ్చటి కంటఁగలదు. ఈవిధముగా భౌమమండ లము భానుబింబమునుండి మనకన్న దూరముగ నున్నకారణమున నా సూర్య రశ్మి స్వల్పముగఁ జేరుచున్నను, వాతావరోధము స్వల్పమైనందున విశేషముగ హరించిపోక యాలోకమున కంటుచున్నది. వాతావరోధము తక్కువగ నున్నం దునఁ బగటిపూఁట నెండ వెచ్చగ నున్నను సూర్యాస్తమయ మగునంతనె వేఁడిమి యతిశీఘ్రముగ నవకాశములోనికిఁ బ్రసరించి దుస్సహ మగునంతశీత ముగఁ గూడ నుండవచ్చును. ఆకారణముననె గోళముఖలంబు సామాన్యముగఁ దెల్లవాఱునరికి హిమాచ్ఛాదితంబై యుండుటయు సంభవించును. మఱియు జలము సూక్ష్మముగ నావిరియై చల్లపడునపుడు, ద్రవత్వము నొందకయె స్థూల హిమంబగుట కవకాశము గలదు గాన ధ్రువము నందె కాక క్రిందఁజాలదూ రము వఱకు మంచుగన్పించును. వాస్తవమునకు దుర్భిణీవేధలకు గోళమధ్యమం

---

* Temperature = తిగ్మము.

దొకటి రెండు శాశ్వతహిమప్రదేశములు గాన్పించుచున్నవి. అవి పేరుకొనిన చెఱువులైనఁ గావచ్చును. అది యట్లుండ మేఘముల మాట—పైవర్ణించినటు లప్పుడప్పుడు గోళము హిమాచ్ఛాదితమై యస్పష్టముగఁ గాన్పించుచున్నది. ఏన నొకానొకప్పుడు వాతావరణమునందు నిశ్చయంబుగ మేఘములు చరించుచున్నటులు దోఁచుచువచ్చెను. ఇట్లు గదలుచున్న మేఘములు సూర్యరశ్మి ప్రతిఫలించుటచేఁ దెల్లగఁ గాన్పింపవలయు, లేదా, నల్లగనైనఁ గాన్పింపవలయు. అదియు నిదియుఁ గాక తెలుపుగా ధూసరంబులై కాన్పించుచున్నవి. ఈ గౌర మేఘములు మహావేగమున నర్కమండలాకాశమునఁ బరువిడుచుండునటులు తెలియవచ్చును. వాని యాకృతిని బట్టియు స్థౌల్యంబు చేతను, నస్వచ్ఛపదార్థతం జేసియు, గోళాతిసమీపప్రవాహంబులవలన నవి ఘనాకృతంబులు గాక వాతోద్ధూతపరాగపాళికలు గా నిశ్చయించిరి.

ఈపరాగమేఘములు సర్వసాధారణముగా రక్తప్రదేశములందు బయలుదేఱుచుండుటంబట్టి యాప్రాంతముల స్థలస్వభావము నిశ్చయింపవచ్చును. వాయుయానములచే సహారామరుదేశములందు భూరజంబులు నిసుకయు లేచి మేఘల, నొకచోటినుండి మఱియొకచోటికిఁ బ్రవహించుచుండుట మనమంద ఱెఱిఁగియున్నాము. ఆవిధముననే యంగారకమండలమునందును వాలుకా నటవి బయలుదేఱుచున్న నసుక మరుప్రదేశములు గల వని యూహింపన యుమఱియు నీమేఘములు రక్తప్రదేశములందుఁ దఱచుగాఁ జూపట్టుచున్నవి. రక్తప్రదేశములన్నియు మరుభూములని యూహింపనయ్యె. అవి మరుభూములు గావచ్చు ననుటకు నితరసాధనంబులును గలవు.

భూగోళమునకుఁ బరమక్రాంతియు* భౌమపరమక్రాంతియుఁ దుల్యము లనియు, నాకారణముననె ఋతుచక్రసామ్య మీరెంటిలోకములకుఁ గలదనియు వర్షాతపాదివ్యవస్థ కొంచెమించుమించుగ నొకటె యనియు నేర్చికొనియుంటిమి. ఆకారణమువలననె మరుస్థలపట్టిక† యు భూగోళమున కెచ్చటఁ గలదో దానికి నట్టిచోటులనె యుండు ననుకొనవచ్చును. భూమండలమునందు, మరుప్రదేశము లన్నియు నిరక్షాది‡ నలువదిర్వైదంశల దూరములోపున నిమిడియున్నవి. భూగోళపటములఁ దీసి చూడవచ్చును. అంగారకమండలమందు నావిధముగనే యీరక్తప్రదేశము లన్నియు గోళార్ధరేఖ కీవలావల నలువదిరైదంశల దూరములో నిమిడియున్నవి. కావున నిదియుఁ దత్తత్ప్రదేశము లెడారినేల లని నిర్ణయించుట కొకకొంత సాయము గాకపోదు.

* పరమక్రాంతి = Obliquity. † పట్టిక = Zone. ‡ నిరక్షు = Equator.

అటులైన నొకసంశయము కలుగవచ్చును. భూమండలమునందు మరు దేశము లున్నవని యెంత విస్తీర్ణములుగ లేవే—యంగారకమండలమునం దవి గోళమంతయు నెట్లుగాఁ గాన్పించునంత తఱచుగ నున్నవే—రెండులోకము లకు సమీపపరిస్థితు లున్నప్పు డీభేద మేల గలుగవలయును?

భూగోళము మండుచున్న పదార్థపిండమై క్రమక్రమముగాఁ జల్లనడి జంతునివాసయోగ్యమగు నవస్థకు వచ్చినతరువాత జలస్థలవిభాగము లేర్పడిన తరువాత నందలి వాయుప్రచారములంబట్టి పర్వతాదివిభాగములంబట్టి కొన్ని దేశములకు వర్షములు కురియుటయుఁ గొన్నిటికి లేకుండుటయు సంభవించి వర్షములు లేనిప్రదేశములు పగటియెండలకుఁ గ్రాఁగియు రాత్రిశీతమునకు సంకోచించియు, వివిధభౌతికార్యములకు లోనై జీర్ణించిజీర్ణించి, శిథిలములై యంత్యావస్థయందు నీటి కాశింపని మొండిజాతి మొక్కలు మాత్రము బయలుదేఱు మరుప్రదేశములుగా మాఱుచున్నవి. దీనింబట్టి స్థలసృష్టివయోవర్షముల తారతమ్యముచే గోళములందు మరుప్రదేశ సంభవమునకుఁ గారణ మేర్పడు నని తెలియవచ్చును. ఏండ్లు ముదిరిన మానవునకు బట్టతల బయలుదేఱునట్లు యీ గోళములకును, వయసు ముదిరినకొలఁది నెడారు లెక్కువగుచుండును. ఒకచోఁ గొంచెము మెడారి పేరు బయలుదేఱినదా దానిచుట్టు పట్టుల వర్షములేక, పార్శ్వ దేశములుగూడఁ గొంచెముకొంచె మది క్రమక్రమముగా వృద్ధిఁబొందును. ఇట్లు బట్ట తల వేయునారంభించినంతనె గోళమునకు వయస్సు తరపడనారంభించె నని చెప్ప వచ్చును.

ఒకటి చిన్నదియు నొకటి పెద్దదియు నగు రెండయోగోళముల నొకే కొలిమియందుంచి, యెఱ్ఱగఁ గాల్చి బయటఁ బడవైచిన, నందుఁ జిన్నగుండు శీఘ్రముగఁ జల్లనగును గదా. అదేవిధముగ భూమండలమునకు భౌమగోళ మునకుఁ గలపరిమాణ వ్యత్యాసముం బురస్కరించి, భౌమమండలమందు భూమండలముకన్న ముందుగ స్థలవిభాగము లేర్పడిన వనియు, దానితోపాటు భౌతికపరిణామములు భూమికన్న ముందుగనే యం దారంభించిన వనియు నిశ్చయము. ఈభౌతికపరిణామబాహుళ్యముం బట్టియొకద పదార్థము లన్నియు జరాక్రాంతము లగుచుండుటచేఁ గావున భూలోకమునం దెడారులు బయలు దేఱకపూర్వమే భౌమమండలమున స్థలప్రదేశ మగుటయు, నది కొన్నినాళ్లు సారము గలిగి యుండుటయు, సారము చచ్చుటయు, మరుప్రదేశ మగుటయు, నామరుదేశము సర్వత్ర వ్యాపించుటయు సంభవించినది. అందుచేతన

గోళమునందు విస్తారము పాఁపపడి, నిర్జలమై, ధాతుచూర్ణలిప్తమై సూర్యరశ్మి ప్రతిఫలించిన నది కాలిన నిప్పుబొగ్గువలె మన కంత దూరమునుండి కన్పించుచున్నది. కావుననె దానిని మన మంగారకగ్రహ మంటిమి. ఉష్ణతత్త్వమంటిమి! సర్వనాశక మగు సేనాని ప్రతాప మంటిమి; వేఁడిమిచేఁ దహతహలాడునట్లు దోఁచు నాగ్రహమున కెన్నిపేరులైనఁ బెట్టవచ్చును! పైని నేర్చుకొనినంతనలి కంగారకగ్రహమున నంతయు స్థలభాగమె యనియు, జలప్రదేశము ధ్రువప్రాంతమునఁ గలదనియుఁ దెలిసినది. గోళమంతయు స్థలప్రదేశమె యైనయెడ భూలోకమునందువలె నచ్చటఁ గూడఁ బర్వతములు కటకములు సమతలములు గలిగి గోళముఖమంతయు గతుకులు గతుకులుగ నున్నదా యను విషయము గూడ నతిప్రయత్నమున నన్వేషింపఁబడినది. ఎన్నివిధములఁ జూచినను నంగారకబింబాగ్రధార యతిస్నిగ్ధమయి తోఁచెనె కాని రేఖయందు ఛిద్రములెన్నఁడుఁ గనుపింపలేదు. దూరదర్శిని యంత్రముతో నేయేకాడశగిన మునసో చంద్రమండలము వేధించుట కారంభించిన దాని బింబాగ్రధార యెంతఛిన్నమై కనఁబడునో చూడుఁడు! దీనింబట్టి యంగారకమండలమునఁ బర్వతము లేమియు లేవని నిశ్చయింపఁగలయును. చంద్రమండలమునందుఁ బల్లములందుఁ బెద్దపెద్దపర్వతములు గలవు. భౌమలోకమందో యట్టివేమియుఁ గనఁబడవు. శమించి యణఁగిన యగ్నిపర్వతములఁ జాడలును గానరావు.

అది యట్లున్నను భౌమగోళమునకుఁ జంద్రబింబమునకు సామాన్యధర్మ మొకటి కలదు. చంద్రలోకమునందును గొన్ని స్వచ్ఛదేశములును గొన్ని ఛాయాతలములును గలవు. ప్రప్రథమమున నీఛాయాతలములు జలప్రదేశములను నాభాసము గల్గెఁ గాని యనుభవమునఁ బండితులు వాని స్థలప్రదేశములుగానే నిశ్చయించిరి. ఈ రెండుమండలములఁ బరిశీలింపఁగ గోళమునకు వయసు ముదిరినకొలఁదిఁ గొన్నిప్రదేశములు లోనికి దించుకొనిపోయి గతుకు లేర్పడుచున్న వనియు నవి చంద్రమండలమునందువలెఁ బర్వతములు పర్వతములుగ నుండఁగనే దించుకొనిపోవచ్చు ననియు లేదా యంగారకమండలమునందువలె స్వచ్ఛప్రదేశములకు స్వచ్ఛప్రదేశములు ప్రత్యేకము సమసీమలుగను, ఛాయాతలములకు ఛాయాతలములు సమతలంబులుగ నుండిన నుండవచ్చును. ఇటులు సమతలముగ నుండుటకుఁ గారణము గోళాద్యవయవమునందుఁ బర్వతములు లేకుండుట యే యగు. ఆపర్వతములు లేకపోవుట చేతనే యగుప్రదేశములు

శీఘ్రముగ వృద్ధిపొంది యుండును. కావున సంగారకగోళము చంద్రమండలము వలె నంతఃప్రళయంబున స్రుక్కి నాశాభిముఖమై యున్న దని చెప్పవచ్చును.

ఈభౌమలోకమునం దిట్టిస్థితి ప్రవర్తిలుచున్నం బ్రాణిలోక మేమైనఁ గలదా? ఉండుటకు వీలుగలదా?, ఉన్నట్టు లేమైనఁ జిన్నె లున్నవా? యను విషయములు చర్చించుటకుఁ దగినయాధారము లన్నియు నింతవనుకఁ దెలిసికొనిన యర్యమగోళ పరీక్షలోఁ గలవు.

వృక్షములకైనను జంతువులకైనను బ్రాణమున కాధారము సూర్యరశ్మి. సూర్యరశ్మి మూలముననె వృక్షములు తమకుఁ గావలయు వాయుపదార్థములు గ్రహించుచున్నవి. సూర్యతీక్ష్ణంబు వలననె పుష్పవికాసమును, ఫలపరిణతియుం గలుగుచున్నవి. ఆవిధముననె, జంతువుల యారోగ్యమునకుఁ బుష్టికి బలమునకు సూర్యరశ్మియె కారణము. కావున నాతపంబునకుం దగినంత తీక్ష్ణ మున్నం గాని ప్రాణిలోకము బయలుదేఱ లేదు. మఱియు నుష్ణతీక్ష్ణతం బట్టియె నానా జాతులును వృద్ధిక్షయములు పొందుచున్నవి. ఆయాయాస్థలములందుఁ గల సూర్యప్రభం బట్టి యందందు వృద్ధిఁ బొందఁగల జంతుజాలముల నిర్ణయింప నగును. ఆయాజంతువుల లక్షణములును దానింబట్టియె కూడుచుండును.

ఇఁక నంగారకమండలమునఁ గలసూర్యాతపస్వభావ మెట్టి దని యన్వేషింపవలయు. గోళోపరితలమున వాయువు గల దని యిదివఱకుఁ దెలిసికొని యుంటిమి. సూర్యరశ్మి గాఢవాయ్వాచ్ఛాదనముం జొచ్చి యాస్థలంబునకంద వలయు. భూమియందున్న యనుభవముంబట్టి, సూర్యకిరణములు వాయువులోఁ జొచ్చిపోవునపుడు వాని యుష్ణిమ కొంతహరించుచున్నట్లు తెలియుచున్నది. మఱియు వాయుపీడన మెక్కువగుకొలఁది నీహరించుటయు నెక్కువగును. వాయు వగాధమైనకొలఁది హరించుటయు నెక్కువగును. పెద్దపర్వతము లున్న యెడల, కటకసీమలకన్న వానియగ్రములందు వాయుపీడనము స్వల్పమగును. అందుచే వాయులీన మగునుష్ణిమయుఁ దగ్గును. కావుననే యొకానొకప్పుడు పర్వతాగ్రములందు సూర్యతేజస్తీక్ష్ణము కటకసీమలకన్న నెక్కువగును. అయినఁ బర్వతాగ్రములు చల్లగ నుండునందురే? అది యెట్లు? అది సూర్యరశ్మి తగ్గుటవలనఁ గాదు. సంతతహిమపాతములవలన! అది యటుండ, సంగారక మండలమునందు, వాయుపీడన మత్యల్ప మని పైని నేర్చికొంటిమి. వాయుపీడన మత్యల్పము గావున సూర్యరశ్మి యావాతావరణఁ జొచ్చి పోవునపుడు దాని తీక్ష్ణమంతగ హరింపదు. అందుచే నంగారకగోళమునకు వాస్తవముగఁ

జేరుసూర్యశక్తి చాలభాగము పదార్థపరిణామములకె వినియోగించును. ఐనను భౌమలోకము మనకన్న సూర్యునొద్దనుండి రెండింతలు దూరముగ నున్న కారణమునఁ బ్రత్యంగుళస్థలమునకు మనలోకమున కుండుచున్న యుష్ణము లోఁ బాతికమాత్రము సేరుచుండును. అంతేగాక, పైచదివిన దానింబట్టి, వసంతారంభమున హిమాచ్ఛాదనము లందుండు గోళమధ్యమునకుఁ జేరుచుండు ననియు, వేసవికాలమునందు ధ్రువప్రాంతహిమము చాలవఱకుఁ గరఁగిపోవుననియుఁ దెలియును గాన, నాలోకము శీతలతమంబుగ నుండనేరదని నిశ్చయముగఁ జెప్పవచ్చును. మనలోకము కన్న విస్తారము చల్లగనుండిన నుండును. వేసవి సమోష్ణముగ నుండును.

పైని జెప్పిన సంగతులంబట్టి యంగారకలోకమునఁ బ్రాణివృద్ధికిఁ దగినంత యెండ కల దని తెలిసినది. మఱియు, శీతకాలానంతరము వృక్షసందోహము బయలుదేఱుటయు గ్రహింపఁబడియెఁ గద. వృక్షజాలము కానిపించుట యొప్పినంతనె, దానితో పాటు కొన్ని కలసియుండు నవియు, నవి నాభాసము లైనవియు, నగుపరిస్థితులు గొన్ని కలవు. వృక్షశాస్త్రమునం బరిచయము గలవారెల్లరు వృక్షములందుఁ బూవులు వికసించిన తరువాత జరుగు విచిత్రసంధానచర్య నెఱుఁగుదురు గాని యది తెలియనివారు, పూవు లందును జంతువులన్నిటనుబలె స్త్రీపురుషవివక్షత గల్గుటయుఁ గొన్ని సమయములందు స్త్రీపుష్పములలోని పుప్పొడి లోనికిఁ బురుషబీజములు వాయుచోదనమునఁ జేరి పిండ మేర్పడుటయుఁ గొన్నిపట్ల స్త్రీపురుషబీజములు రెండు నొకపుష్పమునకే గూడియుండుటయును, మఱికొన్నిటియందు దుమ్మెదలు సీతాకోకచిలుకలు సిగలు మొదలగునవి చేరి, పురుషసుమంబు లొసంగు తీయనితేనియల లంచములు ద్రావి స్త్రీసుమంబుల కుపకారముగఁ బురుషసంధానము సమకూర్చి యచ్చట నిచ్చటఁ గూడఁ బారితోషికములనంది సంతోషించు చిత్రచరిత్రము జ్ఞప్తియం దుంచుకొనవలయును. అంతే కాక, భౌమలోకమున నున్నవృక్షజాలము లన్నియు స్త్రీపురుషబీజములు కలసియున్న పూవులే వేయు నని కాని పూవులన్నియు వాయు సహాయమున నె గర్భముల దాల్చుచున్న వని కాని చెప్పుటకు వీలులేదు గాన నేదో యొకమాదిరి కీటకలోక మూహింపక తప్పదు. కీటకములున్నంతనె యంతకుఁ బైజాతి సృష్టియు వర్ధిల్లియుండుట జీవశాస్త్రపరిజ్ఞానవిదితము గావునఁ బిపీలికాది మానవపర్యంతము భూలోకమునందుంబలె భౌమలోకమున సర్వజంతువులు గలవో యను ననుమానము గలుగుచున్నది.

ఈసందర్భమునఁ గాలువలఁ బరీక్షించిన పట్టునఁ దెల్లంబులైన విశేషములఁ దలంపవలయు. అన్నిటి కన్న నవి మాధ్యందిన రేఖల వంటి సమగ్ర సరళరేఖలై గోళమంతయు నావరించియుండుట యాగ్రహనిజస్వభావము దెలియుటకుఁ దగినప్రబలాధారము. ఏయుయోజామార్గపట్టికలు నంత సరళముగఁ గాన్పింపవు. ఇవియంతసరళముగ నుండుటకుఁ బర్వతములు మొదలగునవ రోధము లంగారకమండలమున లేకపోవుటొకటి. అట్టియవరోధములు లేకు న్నను ననేకసహస్రయోజనముల కొలఁది సరళరేఖ రచించుట గణితము యంత్రవిద్య సంపూర్ణముగ నభ్యసింపంబడినఁ గాని సాధ్యము గాదు. కావున నొకమా ఱానాలుగు జంతునిర్మితము లనియొప్పికొంటిమా యాజంతువుల మేధాశక్తియు ననల్ప మని నిశ్చయింపనగు. మఱియు నీకాలువలు స్థలవైశాల్య మునకుఁ దగిన సంఖ్య గలవనియు నేర్పికొంటిమి. ఇదియు మేధారచితంబైన వ్యవస్థ సూచించుచుండు. తఱువాత జంటకాలువలు సదేశక్తికిఁ దార్కాణంబు. అన్నిటంబట్టి యంగారకమండలంబునఁ గూడ జంతుజీవనము గడచుచున్నదియు, నట్టిజంతుజీవనముల చిహ్నములు దూరదర్శనీయంత్రసహాయమునఁ బండితులు గ్రహించిరనియు నిశ్చితంబగుచున్నది. ఈసందర్భము లన్నియు నెంచి యాలోక స్వరూపముఁ గొంచెము బుద్ధికి సాక్షాత్కరించుకొన్న నెంత వింతగ నుండును! మొట్టమొదట నొకయుల్కాశకలమై కాలక్రమంబునఁ జల్లబడి ద్రవమై, పైపై తెట్టెలు గట్టి ఘనీభవించి పొరలుపొరలుగ నల్లిగడ్డవలె నొకగోళమై, స్థలజలవిభాగసమన్వితమై, యతిసూక్ష్మజీవులు లేచి, సృపములు, కీటకములు, పక్షులు, స్థలచరములు గలిగి, యుపాయశాలురచేతులలోఁ బడి కృషి, వాణిజ్య వ్యవహారములు గడచి, వార్ధక్యదశవచ్చి ద్రవమంతయు నాఱిపోయి జలంబునకై జంతువులన్నియు తహతహలాడుచు మలయుచుండ గోళమీ చివర మొదలాచిపరవఱ కేకప్రయత్నమున నసిశమ్ముఁ గాలువల నిర్మింపను నితరసౌకర్యములు గావించుకొనను బాటుపడుచు భూమలోక ప్రళయాసన్న సమయమునఁ గాలపురుషునితో దంష్ట్రాదంష్ట్రి, బాహాబాహి యుద్ధంబు గావించుచు, నానాఁటికిఁ గ్లేశంబు పడనను బ్రయత్నంబులవలనను, సానఁదీరిన సూక్ష్మమేధాధారముననే యంతరింపనైయున్న జాతి నీఁక రెండునిమేషములు నిలువఁ బెట్టుకొనుటకు గిజగిజలాడుచున్న "యాంగారకేయులు" గన్నులగట్టి నట్టు లుందురు గద!

చంద్రమండలము నంగారకగోళము భేదించినంత యత్నమునఁ బండితు

లేయితరలోకములఁ బరిశీలింపలేదు. ఈ రెంటింటివలనను మనము నేర్చికొనిన పాఠమేమి? చంద్రమండలము ప్రప్రథమమున నొకలోకమై యుండియు, నిప్పు డారినదివ్వె యై పోయినది గద! అది మహాప్రేతము కద! అంగారక మండలము ను జరితంబయి యున్నది; మనభూలోకము నంగారకగోళముకన్నఁ బెద్ద పిండమగుట వలన నిప్పుడిప్పుడె బట్టతల లారంభించినది. అదిగో నెదుట భౌమ గోళ మెట్టులైనదో చూచిన భూమికి మాత్రముఁ గాలక్రమమున నట్టి యవస్థ రాదని యెవరు చెప్పఁగలరు? తక్కిన గోళములును భూమివంటివి కావా? దీనిం బట్టి సృష్టిస్వభావ మెట్టులున్నది? కావున మనము సర్వజ్ఞునితో పాటు నిలిచి,

"యథాప్రదీప్తజ్వలనం పతంగా విశన్తి నాశాయసమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశన్తిలోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥
లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా ల్లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః।
తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తివిష్ణో"

అని నమస్కరింపవలయు.

ధీరం వేంకటాచలపతి.

శ్రీరస్తు.

# నిఘంటువులు.

ప్రపంచమందలి వివిధవిషయములను బోధించుపదము లేభాషయందైన నైదాఱువేలు కంఠస్థములై యుండినచోఁ దనమనోభావములను సంపూర్ణముగా నితరులకుఁ దెలుపుటకుఁ గాని, యితరగ్రంథములందలి యభిప్రాయములను జక్కఁగా నెఱుఁగుటకుఁ గాని శక్యమగును. అట్లు పదసామగ్రి లేకపోయినచోఁ దనమనోభిప్రాయము లెట్టివైనను, వివరముగా మాటలాడుటకుఁ గాని వ్రాయుటకుఁగాని శక్తి చాలక గుటకలు మ్రింగవలసివచ్చును.

సకలవిషయములందును సంపూర్ణాభివృద్ధి గాంచిన సంస్కృతభాషయందలి పదములను గంఠస్థములుగఁ జేసికొనుటకుఁ బూర్వపుకవులు ఛందోబద్ధములుగఁ గొన్ని నిఘంటువులను రచించిరి. గద్యరూపముగ నుండిన జ్ఞప్తియందుంచుకొనుటకు సాధ్యముగాదని యెంచి యట్లుచేయుచు వచ్చిరి. వీ రొక్కొక్క విషయమునకుఁ జెందినపదముల నొకవర్గముగాఁ జేసి యాయాపదములకుఁ దగినట్లు పురవర్గము శైలవర్గము మొదలుగాఁ గలపేళ్లు పెట్టిరి. నానార్థములఁ దెలిసికొనుట కంత్యాక్షర నియమమును బరిగణించిరి. ఈ విధముగ రచింపఁబడిన నిఘంటువులలోఁ గొన్నిమాత్రమే మన కిప్పుడు లభ్యము లగుచున్నవి. అం దమరసింహుని నామలింగానుశాసనము. ఇది యన్నినిఘంటువులకన్న మిక్కిలి వ్యాప్తిలో నున్నది. దీనికి సంస్కృతమునఁ బెక్కువ్యాఖ్యానము లున్నవి. పురుషోత్తమదేవుని త్రికాండశేషాదులు కేశవుని కల్పద్రుమము దుర్గాదాసుని శబ్దార్ణవము, ధనంజయుని ప్రమాణనామమాల, భరతసేనమల్లికుని ద్విరూపకోశము, మహీదాసుని మాతృకానిఘంటువు, మహాక్షపణకుని యనేకార్థధ్వనిమంజరి, మహాదేవుని యవ్యయకోశము, మహేశ్వరుని విశ్వప్రకాశమును శబ్దభేదప్రకాశమును, మేదినీకరుని నానార్థకోశము, యాదవుని వైజయన్తి, వరరుచియొక్క లింగవిశేషవిధి, వేణీదత్తుని పంచతత్త్వప్రకాశము, శాశ్వతుని నానార్థసముచ్చయము, శివరాముని లక్ష్మీనివాసము, హారదత్తుని గణితనామమాల, హలాయుధుని యభిధానరత్నమాల, హర్షకీర్తియొక్క శారదీనామమాల, హేమచంద్రుని యనేకార్థసంగ్రహము మొదలగునవి. ఈకాలమున వ్యాఖ్యాతృచక్రవర్తివలె వివిధకోశములను జదివి వ్యాఖ్యానములు వ్రాయుచు

రెవరు? ఇంచుమించుగా నాంధ్రభాషయందుండిన తత్సమపదము లన్నియుఁగల నామలింగానుశాసనమే చదువుట కష్టమగుచుండఁగాఁ దక్కినవానినా చదువుట.

రానురాను విషయములే ప్రధానములుగాని శబ్దస్వరూపముల నంతగాఁ బాటింప రాదనెడి కాలము తటస్థించుచుండఁగాఁ బాశ్చాత్యపద్ధతి ననుసరించి సకలపదముల కర్థములు సులభముగా లభించుట కకారాదిక్రమముగా నిఘంటువులు రచింప నారంభించిరి. అందును సంస్కృతశబ్దములకు సంస్కృతపదములతోడనే యర్థాదులు వ్రాసినవి కొన్ని కలవు. అందుఁ బ్రథమమున రచింపఁబడినది రాధాకాన్తుని శబ్దకల్పద్రుమము. ఇందుఁ బ్రతిపదమునకుఁ బ్రకృతిప్రత్యయములే కాక పర్యాయపదములును విశేషవిషయములును గలవు. రెండవది వాచస్పత్యము. ఇది తారానాథతర్కవాచస్పతిమిశ్రకృతము. దీనికి సాటి యగునిఘంటువు వే ఱొకటి లేదందురు. ఇందు శబ్దార్థములే కాక, మ-రా-రాజశ్రీ, కొమర్రాజు లక్ష్మణరావుగారిచేఁ గల్పింపఁబడు చున్నవిజ్ఞానసర్వస్వమువలె నచ్చటచ్చటఁ గొన్నివిషయములను గూర్చి విశేషముగా వ్రాయఁబడెను. వీనియన్నిటికంటె విశేషవిషయములు గలిగి దేశస్థుల యభిమానము లేకపోవుటచే ముద్రింపఁబడకయున్న గొప్పయకారాదినిఘంటు వొకటి కలదు ఇదియాంధ్రదేశస్థు లగుమహామహోపాధ్యాయ పరవస్తు భగవద్వేంకటరంగాచార్యులవారిచే రచింపఁబడినది. దీనికి శ్రీ యాచార్యులువారిడిన శబ్దార్థసర్వస్వమను నామమెంతయుఁ దగియున్నది. వీరు తమజీవితము నంతయు నీనిఘంటువునకై వినియోగించి దీనితో సాటియగు నిఘంటువు వేఱొకటి యున్నదా యనిపించిరి. ఇట్టి గొప్పనిఘంటువు నాంధ్రునిచే రచింపఁబడె నని యాంధ్రలోకము గర్వింపవలసినదే కాని యట్టియుత్తమనిఘంటువు ముంద్రింపఁ బడక కట్టలై పెద్దపెట్టెయం దుంచఁబడుటకు మిగుల విచారపడవలసినచ్చుచున్నది. ఇంకను శబ్దస్తోమమహానిధి మొదలుగాఁగల నిఘంటువులే కాక, సంస్కృతశబ్దములకు దేశభాషాపదములతో నర్థములు వ్రాయఁబడిన నిఘంటువులు పెక్కులున్నవి. అట్టివానిలో నాంధ్రమునఁ బరవస్తువారిచే రచింపఁబడి విశాఖపట్టనమున ముంద్రింపఁబడిన సర్వశబ్దసంబోధని యొకటి.

ఇఁకఁ బాశ్చాత్య పండితవర్యులచే రచింపఁబడిన సంస్కృతాంగ్లకోశములు కొన్ని గలవు. అందు విల్సను దొరగారిచేతను, మానియరు విల్లియము దొరగారిచేతను రచింపఁబడినవి ముఖ్యములు. పైఁజెప్పఁబడిన సకలకోశములను బరికించి యన్నిటికన్న మిన్నగా నుండునట్లు వామనశివరాము ఆప్టేగా

రోక్తసంస్కృతాంగ్లకోశమును రచించిరి. దీనియందుసకలలౌకికపదములేకాక వైదికపదములును గొన్ని కలవు. దీనిశ్రేష్ఠత్వ మిట్టిది యని వర్ణింపలేము. ఆంధ్రుల భాగ్యవశముచే నిప్పుడాంధ్రభాషలోనికి మార్పఁబడి శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువునందుఁ జేరుచున్నది.

ఇఁకఁ దెలుఁగుబాసయందలి కోశములను గూర్చి విచారింతము. సంస్కృతభాషాసాంప్రదాయము ననుసరించి తొలుతఁ బద్యరూపముగా రచింపఁబడిన కొన్నినిఘంటువులు గలవు. ఆంధ్రనామసంగ్రహము. ఇది పైడిపాటి లక్ష్మణకవికృతము. నామలింగానుశాసనమువలె దీనినే పూర్వులు పఠించెడివారు. ఆంధ్రనామశేషము. ఇది యడిదము సూరకవిప్రణీతము. ఆంధ్రభాషార్ణవము ఇది నుదురుపాటి వేంకనార్యప్రణీతము. ఇది తెనుఁగుపదములకు నామలింగానుశాసనమువంటిది. ఆంధ్రపదాకరము. ఇది పూసపాటి వీరపరాజుగారిచే రచింపఁబడినది. సాంబనిఘంటువు. ఇది రంగకవికృతము. వేంకటేశాంధ్రము. ఇది వేంకనకవివిరచితము. ఇంకో నాంధ్రరత్నాకర మనునిఘంటువొకటి కలదు.

ఆంధ్రభాషయందలి తత్సమతద్భవదేశ్యగ్రామ్యపదములకు మొదట నకారాదిక్రమముగా నిఘంటువు రచించినది బ్రౌనుదొరగారు. వీరు పండితులచేఁ బ్రమాణగ్రంథములనుఁ జదివించి, విశేషపదములకుఁ జక్కని ప్రయోగముల నిచ్చిరి. తర్వాతఁ జిన్నయసూరిగారు కొన్నిగ్రంథములు చదివి నిఘంటువు రచించుచుండఁగనే మృతినొందిరి. ఆంధ్రలోకమునకు వచనరచన నేర్పిన దీపండితుఁడే. వ్యాకరణమును రచించి యాంధ్రపాణిని యనియనిపించుకొనిన దీవిద్వాంసుఁడే. ఈకోవిదుఁ డాంధ్రభాష కొనర్చినసేవ మిక్కుటమైన దని యెల్లరు నంగీకరింతురు. పిమ్మట బహుజనపల్లి సీతారామాచార్యులుగారు సూరిగారి నిఘంటువు నాధారముగాఁ జేసికొని మఱికొన్నిగ్రంథములను జదివి శబ్దరత్నాకర మనునిఘంటువును రచించిరి. దీనినిబట్టియే మహాకాళి సుబ్బారాయఁడుగారు శబ్దార్థచంద్రికను, కొట్ర నారాయణశాస్త్రిగారు లక్ష్మీనారాయణీయ మనుశుద్ధాంధ్రనిఘంటువును రచించిరి. ఓగిరాల జగన్నాథకవి గురుజాడ శ్రీరామమూర్తిగారిచే రచింపఁబడిన యాంధ్రపదపారిజాత మనునిఘంటువును గలదు. ఇన్నినిఘంటువు లున్నను మన కిప్పుడు లభ్యములగుచున్న ముద్రితాముద్రితకావ్యములందుఁ గాన్పించు పదముల కర్థములు దొరకుట లేదు. సకలపదముల కర్థములు లభించు నిఘంటువు లేదు. ఇప్పుడా యాంధ్ర

భాషకుఁ గొఱఁత కాదే! శబ్దరత్నాకరాది నిఘంటువు లాకొఱఁత దీర్పలే వందురేమో! అన్నిటికన్న మిన్నయగు శబ్దరత్నాకరమునందు సర్వసాధారణము లగుప్రోత్సాహ మనుమాట గాని సమాధాన మనుమాటగాని లేదే! ఇఁక నందు లేనిదేశ్యపదాలు పెక్కు లున్నవి. ఉన్నవానిలోన నర్థభేదమును జూపుట కొకయుదాహరణ మిచ్చెదను.

కాసించు. దే. స. క్రి. కాసెగాఁగట్టు.

ద్వి. కడుమైంపు వేలికఁ గాసించి. హరిశ్చ. ౨-వ భాగము.

అనియొకయర్థమునే వ్రాసి ముగించిరి. ఇతరగ్రంథములందగపడు "కాసించు" శబ్దమున కర్థాంతరము గాన్పించుచున్నది.

కాసించు. స. క్రి. ధరించు.

సీ. పులితోలుపచ్చడంబుగఁగాసించిసర్వాంగములను భస్మంబు, బూసి
విక్ర. 8-105.

సీ. చెంగావి వలిపెంబు చెలువారఁగాసించి వలముగా మేన గంధంబలంది
విక్ర. 10. 84.

ద్వి. పలుచఁగాఁ గుంకుమ పంకంబు నలఁది,
చెలువార నెరిపట్టు చీరఁ గాసించి
పొలుపొంద భూషణంబులు చక్కఁదిగ్గి
కలువపూవులదండ గళమున వేసి.

నవనాథచరిత్ర. గండవ పుస్తకము. 115-వ పుట.

ఇంకను బ్రౌనుదొరగారిచేఁ జూపఁబడిన యట్టిపదము లెన్ని యేనియుఁ గలవు. గ్రంథవిస్తరభీతిచే మానితిని.

ఏవిధమునను గొఱఁత చూపట్టని గొప్పయాంధ్రనిఘంటు వాంధ్రభోజులును, పీఠికాపురసంస్థానాధీశులునగు మహారాజరాజశ్రీ శ్రీరాజారావు వేంకటకుమారమహీపతిసూర్యరావుబహదరువారి యనుగ్రహమునఁ బయలు వెడలనున్నది. ఈసూర్యరాయాంధ్రనిఘంటువునకు బ్రహ్మశ్రీ జయంతిరామయ్యపంతులు B. A. B. L. గారు ముఖ్యసంపాదకులుగా నేఁడిది పనిచేయించుచున్నారు. ఈనిఘంటువునందు వామనశివరామ ఆప్తేగారికోశమందలి సంస్కృతపదము లన్నియు నుండును. ఇప్పుడుదొరకు ముద్రితాముద్రితగ్రంథములందలి పదములన్నియు నిందుఁగాన్పించును. ఆంగ్లేయకోశములవలెఁ దత్సమేతరశబ్దము లే యేభాషలనుండి పుట్టినవో, వానియుత్పత్తి యెట్లో చూపఁబడును. భారతఖండమందలి యే దేశభాషయందును లేకయాంధ్రమునందే వెలువడ నుండిన యీయాంధ్రకోశ మచిరకాలముననే, యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రమగును.

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి.

శ్రీరస్తు.

# అల్లసాని పెద్దనార్యకవిత్వతత్త్వము.

కం. "తన మొగము తనకు నగపడ, దనువుగ నద్దమునఁ గాక యట్టుల మహా
ఘనుఁడైనను గవి యొరుచే, తన దెలిసికొనంగ నగును దనతప్పొప్పుల్."

మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నముపంతులవారు (సుబంధుఁడు.)

జాత్యున్నతస్థితికిఁ దెచ్చు మూలకారణములలో సారస్వతప్రక్రియ మొదటిది. ఇది జాత్యభివృద్ధికి సమునగు నాదర్శముల నేర్చి కూర్చి వానిం జేరు నుపాయములఁ గరతలామలక మొనర్చి మనోవృత్తుల వికసింపఁజేసి క్రియాసిద్ధి నందఁ బురికొల్పును. దండ్యాచార్యులవారిట్లు కావ్యమహిమము [illegible] యుండిరి.—

శ్లో. ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయం
తేషా మసన్నిధానేపి నస్వయం పశ్యనశ్యతి॥

జాత్యున్నత్యప్రదము లగు నాదర్శములఁ జూపు సారస్వతశ్రేష్ఠ్యమున్న తావుననే నిక్కమగు నాగరకతయును జాత్యౌన్నత్యమును గాన్పించుచున్నవి కావున లోకములో నౌన్నత్యముం గోరుజాతులు సారస్వతాభివృద్ధిఁ గావించుకొనఁ బాటుపడుచుండ్రు. ఇప్పు డాంధ్రులెల్లరును స్వాభివృద్ధికై సర్వవిధములఁ బనిచేయుచున్నారు. సారస్వతాభివృద్ధికిఁ గూడ వీరు పాటుపడుచున్నారు. మనలో సారస్వతప్రక్రియ పుట్టి యించుమించుగాఁ దొమ్మిదివందలేండ్లయినను నింకను బొందఁదగిన యభివృద్ధికి నీసారస్వతము రాలేదని విజ్ఞులగువారు తలంచుచున్నారు. తొమ్మిదివందలేండ్లనుండి వ్యాప్తినందఁ జూచుచున్న మన సారస్వతములో లెక్కకు రాఁదగిన గ్రంథరాజములు మిక్కిలి తక్కువగా [illegible] నన్నయభట్టారకుఁడు మొదలు నేఁటివఱకును బుట్టినగ్రంథముల [illegible] లెక్కకు మిక్కిలిగా నుండు ననుటకు సందియము లేదు. అట్లయినను మిక్కిలి తక్కువగా నున్నవని యెట్లు తెల్పితి మందురేనిఁ జాలభాగ మాగ్రంథము లన్నియు నొక్కటియే పోఁతఁ గల్గి యున్నవి. ఒకటియే గమనిక; ఒకటియే రసము. ఒకగ్రంథముఁ జూచిన రెండవగ్రంథమం దేమియుండునో చెప్ప వచ్చును. పెద్దనార్యుని మనుచరిత్రము పుట్టినది మొద లాంధ్రవాఙ్మయప్రవాహ

మంతయు శృంగారరసప్రవాహమై పోయిన దని చెప్పనగును. నడుమ నడుమ నీతిప్రధానము లగు హరిశ్చంద్రోపాఖ్యానాదులు పుట్టినను మొత్తముమీఁద శృంగారరసప్రధానము లగు గ్రంథము లమితముగాఁ బుట్టినవి. వీనియందుఁ బచ్చిశృంగారము చాల హెచ్చుగా నున్నది. దీనికిం గల కారణము దూరమై దురూహ్యముగా లేదు. లోకమును సర్వసామాన్యముగా నాకర్షించునది శృంగారము. ఆహేతువుచే మనకవు లాప్రవాహములోఁ బడిపోయిరి. మరలించువార లంతగా లేకపోయిరి. మనవారికిఁ గావ్యనిర్మాణమునందే యభిలాష హెచ్చుగాఁ గలదు గాని సారస్వతాభివృద్ధికి మూలము లగు తదితరమార్గములఁ ద్రొక్కుట కంతగా నభిలాష లేదు. సారస్వతాభివృద్ధికిఁ గావ్యనిర్మాణ మెట్లవసరమో దాని విమర్శనమును నంతే యవసరము. విమర్శనము కవులఁ జెడుదారులఁ బోనీక మంచి మార్గమునకు మరల్చుచుండును. కావ్యకల్పనాకుశలత కలవారు వానిని గల్పించుచుండిన, విమర్శకులు వానిమంచిచెడ్డల విమర్శించుచుండవలయును. విమర్శనభాగము మనలోఁ దక్కువగా నున్నది వేఱుగ విమర్శకులు లేరు. ఆహేతువుచే మనపూర్వకవులు, పాపము, కావ్యనిర్మాణమును జేయుభారమునే గాక విమర్శభారమును గూడఁ గొంతవఱకుఁ దలపైఁ బెట్టుకొనుచు వచ్చిరి తిక్కన తననిర్వచనోత్తరరామాయణములోఁ గావ్యనిర్మాణము చేయుమార్గములం గూర్చి ముచ్చటించి కుకవితిరస్కృతిఁ గావించి సుకవిస్తుతి నొనరించె. పింగళి సూరనాదులను నట్లుచేసిరి. అది మొదలు మనలోఁ గబ్బముల నల్లువా రెల్లరును సుకవిస్తుతిని గుకవినిందను దప్పక కావింప మొదలిడిరి. విమర్శనములు మనలో లే[?]డినను మనసారస్వత మంతయు నొక్కటియే మొఱ్ఱపెట్టుచున్నది. ఏమని? సారవంత మగుకవిత్వమును స్తుతించి తీరవలె అట్లే సారహీన మగుకవిత్వమును నిందించి తీరవలెననియే. వీని నట్లు చేయవలసివచ్చినది? ఇది కావ్యకర్త కొకపని యెట్లయినది? సారహీన మగుకుకవిత్వము నిందితమై త్రోసివేయఁబడకుండిన సారవంత మగుకవిత్వ మభివృద్ధినొందదు. కావ్యమునిపేరు పెట్టి గ్రంథమల్లువాఁ డెల్లఁ గుకవినిందఁ గావించుచో నిఁకఁ గుకవి యెచట నుండును? కావ్యము లొనరించువారిలోనే కుకవులు నుందురు గదా! కానఁ గావ్యములోఁ గుకవినింద చేసినమాత్రముచే సుకవిత్వకుకవిత్వముల భేద మేర్పడి కుకవిత్వ మడుగంటి సుకవిత్వము వృద్ధిపొందదు. అదిగాక సుకవులచే నిందింపఁబడు కుకవులు లోకులకుఁ గుకవు లని సులభముగాఁ దెలియుకొనినే యుండును. వారి గ్రహించు టంతగాఁ గష్టము కాదు.

కేవల కుకవుల గ్రంథములు వానియంతట నవియే నశించును. కాన సారస్వతమునకు దానిమూలముగా నంతగా హానియుండదు. కాని "ప్రమాదో ధీమతామపి" అను న్యాయమును బట్టియును మానవులు సర్వజ్ఞులు కాకుండుటం జేసియును సుకవుల గ్రంథములందే యొకవేళ దోషములు దొరలవచ్చును. "నేరములు కాళిదాసమయూరాదులకైనఁ గలవు." మహాకవుల దోషములు దోషములు కాకపోవు కాని లోకము స్థూలదృష్టిచేఁ గవిశ్రేష్ఠుల దోషములను గూడ గుణములనుగానే తీసికొని వానినిగూడ ననుకరింపుట తలంచును. దాన హాని కలుగును. కావున సద్గ్రంథముల గుణాగుణవిమర్శన మవశ్యకర్తవ్యము. అట్లు చేసినం గాని నిక్కముగు సారస్వతాభివృద్ధి కానేరదు. కాఁబట్టి సత్యాంధ్రసారస్వతాభివృద్ధియందలి యభిలాషచే మనలోని సుప్రసిద్ధగ్రంథరాజముల వరుసగా విమర్శింతును. మనయాంధ్రసారస్వతశృంగారప్రవాహమునకు జన్మస్థానమైన పెద్దనార్యకృతమనుచరిత్రమును బ్రప్రథమమున నీచిన్నిగ్రంథమున విమర్శించెదను. ఈకవితల్లజుని ప్రఖ్యాతింబట్టి యీగ్రంథమునందలి ప్రమాదములుకూడ గొప్పగుణములుగా లోకముచే నెంచఁబడుచున్నవి. విమర్శకుఁడు రాగద్వేషములకు లోనయి గుణమును దోషమనరాదు. దోషమును గుణమనరాదు. మఱియును మోమోటమునకును జంకునకును లోనుగాక తనకుఁ దోఁచినదానిని సరిగ లోకమునకు సువ్యక్తము చేయవలెను. అప్పుడు గాని విమర్శనములవలని ఫలముండదు. కావున నీగ్రంథముపై నాకుఁ దోఁచిన దానినెల్ల స్పష్టముగా వ్రాసినందులకుఁ జదువరులు నన్ను మన్నింపవలెను. ఈ ప్రసిద్ధకవి తప్పులనుగూడ మనవారెట్లు గుణములనుగా స్తుతించుచు వచ్చిరో వానినెల్ల నిందుఁ జూపుచుందును. దోషముల గుణములనుగా నెంచినప్పుడు విమర్శకులు తప్పక యడ్డుపడవలెను.

ఆంధ్రసారస్వతమున నల్లసాని పెద్దన కీఁదగిన తావు:—ఆంధ్రకవితాపితామహుం డని పేరందినట్టియుఁ గవిరాజును రాజకవియు నగుకృష్ణదేవరాయనిచే మిగుల మన్ననఁ బడసినట్టియు నాంధ్రమహాకవి యగుపెద్దనార్యుఁడాంధ్రలోకమునఁ జాల సుప్రసిద్ధమహాకవిగా నున్నాఁడు.

పెద్దనప్రసిద్ధి.

క. "పెద్దనవలెఁ గవి చెప్పినఁ, బెద్దనవలె నల్పకవిని బెద్దనవలెనా!
యెద్దనవలె మొద్దనవలె, గ్రద్దనవలెఁ గుంటనక్క కవిచోడప్పా"

ఉ. "ఇష్టుఁడు తోడు నన్నకవి యెన్నఁగ తిక్కనసోమయాజి దా
నస్తుతిఁ జేసెనే కవివరాలికి మునుగఁ గొండ వీటగు నల్లసానిమా
పెద్దన." కణాద పెద్దన.

అను పద్యము లీతని ప్రసిద్ధిని వెల్లడింపఁగలవు. ఈతఁ డిట్లు ప్రసిద్ధకవి గావుననే నే నీతని గ్రంథవిమర్శనమునకుఁ గడంగితిని. పాలసముద్రముం దరచి నప్పుడుగదా యమృతమైనను హాలాహల మైనను బుట్టుట!

పెద్దనగ్రంథములు:—ఈసుప్రసిద్ధకవితల్లజుఁడు విరచించిన గ్రంథము లెవ్వి యని చెప్పవలెను గాని మనుచరిత్ర మొక్కటియే లోకములో లభ్యమై వాడుకలో నున్నది. హరికథాసార మనుమఱియొక గ్రంథమును గూడ విరచించెనఁట. కాని యది యెచ్చటను లభ్యమగుట లేదు. "లక్షణగ్రంథములయం దక్కడక్కడ నుదాహరింపఁబడిన పద్యములు లభించుటయే గాని హరికథా సారము పూర్ణముగా దొరికినది కాదు" అని కవులచరిత్రమునందు వ్రాయఁబడియున్నది. కవులచరిత్రములోనే "పెద్దనామాత్యుఁడు హరికథాసారము, స్వారోచిషమనుచరిత్రము మొదలైన పెక్కు గ్రంథములను రచియించెను." అనికూడ వ్రాయఁబడియున్నది. కాని యీకవితల్లజుఁడు పెక్కు గ్రంథములు విరచించె ననుట కాధారము మృగ్యము. మనుచరిత్రమునందుఁ గవి తా నంతకుఁబూర్వము గ్రంథములను వేనిని వ్రాసినట్లు చెప్పుకొనలేదు. కృష్ణదేవరాయల యనంతరమునందుఁ జెప్పినపద్యములోఁగూడ "మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ బల్లకి తనకేలఁ బట్టి యెత్తె"నని మనుచరిత్రమును మాత్రమే చెప్పుకొనియున్నాఁడు. హరికథాసార మొసరించిన పెద్దన యెవరో. ఈతఁడే యని యను నీతఁడు వ్రాసిన దనఁబడు రెండుగ్రంథములలోను మనుచరిత్ర మొక్కటియే లోకములో వాడుకలో నున్నదిగదా! కాన నీతనికవిత్వపటుత్వాదికమును దెలిసికొనుట కొక్క మనుచరిత్రమే యాధారమై యున్నది. ఆగ్రంథరాజ మెట్లున్నదో కనుఁగొనినఁ బెద్దనార్యునకు సారస్వతమున నీయఁదగు తావు తేలును. కాఁబట్టి మనుచరిత్రమును సంగ్రహముగా విమర్శింతము.

పెద్దనార్యునికవితాపుత్రికయొక్క మూర్తి:—శబ్దార్థంబులు కావ్యకన్యకు మూర్తి యని లాక్షణికులు వచించియున్నారు. "శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ" అని విద్యానాథుఁడు వచించె. "తనువగు శబ్దార్థంబులు" అని మూర్తి పలికె. కావునఁ బెద్దనార్యునికవితాకన్యయొక్క మూర్తి యెట్లున్నదో యనఁగా రచన యెట్లున్నదో ముందుగా విచారింతము. పదములకూర్పులోఁ బెద్దనార్యుఁడు

చాల నేర్పుకలవాఁడు. అపార మగునుభయభాషాజ్ఞాన మీతనికిఁ గలదు. శబ్ద జాలమంతయు నీతని జిహ్వాగ్రమున నటించుచుండె. ఆయాపదముల నేర్చి కూర్చుటలోఁ గూడ నీతనికి మంచి సామర్థ్యము కలదు. ఈవైశద్యమే యీతనికిఁ జాలఁ బ్రఖ్యాతిని దెచ్చినది. ఆయాకవుల వైదగ్ధ్యమును వర్ణించుటలోఁ బాంచాలీపరిణయకర్త యగు కాకమాని మూర్తికవి:—

గీ. "అల్లసానివాని యల్లిక జిగిబిగి, ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకుఁ
బాండురంగవిభుని పద్యంబుహరువును, గాకమానిరాయ నీకె గలదు."

అని యల్లసానివాని నల్లికకు మెచ్చుకొని యున్నాఁడు. గణపవరపు వేంకట కవియును బూర్వకవులవిశేషముల వర్ణించుటలో:—

గీ. "ఆంధ్రకవితాపితామహు నల్లికబిగి, ముక్కుతిమ్మని తేటయు భూషణునియ
లంకృతియు నీకెకలదౌ తలంప లక్ష, ణకవి యప్పయ వేంకటసుకవిచంద్ర!"

అని యల్లికనే మెచ్చుకొనియున్నాఁడు. ఇతరమునం దీతనికిఁ బ్రజ్ఞ లేదను భావము కాదు గాని యీతనిముఖ్యప్రజ్ఞ యల్లికబిగి 'యని సూచింపబడుచున్నది. ఇందులో నీతనిని మొదటితరపు కవి యని చెప్పవచ్చును.

ఈతనిరచనమునందుఁ గొన్నిదోషముల నెంచెదరు. ఆముక్తమాల్యద యందు నెంచఁబడిన విసంధిదోషాదులిందును గొంతవఱకుఁ గలవు. కాని యవి నెరసులు. అంతగాఁ బాటింపఁదగినవి కావు.

ఇందలిభాష:—ఇందలిభాష చాల సలక్షణమైన గ్రాంథికభాష. లక్షణ విరుద్ధము లగుప్రయోగము లతివిరళములు. ఈతఁడు చమత్కారముకై యొక కొన్ని నియతస్థలముల నన్యభాషాపదములఁ బ్రయోగించె. ఈ క్రిందిపద్య మందుల కుదాహరణమందురు.

సీ. పచ్చనిహురుముంజిపనివాగె పక్కెర పారసీకల్లంబు పట్టమయము
రాణనొప్పారు పైతాణంబు సింగిణి తళుకులకోరులతరకసంబు
మిహిపసిండిపరుంజు మొహదా కెలంకుల తావుగుజ్జరిసేత కేవడంబు
డాకెలంకున సిరాజీకరాచురకత్తి కుఱుఁగటఁ గ్రొవ్వాడి నొరకులపొది
వీలికుంచె తలాటంబు బేరజంబు, మణుల మొగముట్టువన్నిసాహిణి యొకండు
కర్తయెదుటికిఁ గొనివచ్చె గంధవాహ, బాంధవంబగునొక మహాసైంధవంబు.

ఇది యన్యభాషాపదప్రయోగమున కుదాహరణము కానేరదు. ఇం దితరదేశ నామములుమాత్ర మున్నవి.

ఇందలి “పారసి” మున్నగు పదముల ప్రయోగ మన్యభాషాపదముల స్వభాషలో వాడినటుల ననుచభిలాషచే నచ్చినదికాదు. ఇం దున్నవి దేశనామములు పెద్దనార్యుని నాఁటి కాయాదేశముల వస్తువులయందుఁ దమి హెచ్చుగా నుండుటచే నా యాదేశసంబంధవస్తువులు వాడుకలో నున్నవని తెల్పుటకై కవి యీపద్యమును సరసముగాఁ జెప్పినాఁడు. ఈతఁడు తనకుఁ బూర్వమునం దున్న నన్నెచోడుఁడు, సమకాలమున నున్నరాయలవారు, ధూర్జటి మున్నగు వారివలె మనుచరిత్రములోఁ గన్నాటభాషాపదములు లోనగువానిని వాడి యుండ లేదు. ఇప్పటివారివలె భాషాసాంకర్యము చేయ నిచ్చగలవాఁడు కాఁడు. “హిందూరాజ్యరమాధురంధర” అని హిందూశబ్దమును వాడె. కాని యిది సంస్కృతపదమె యని మనదేశపూర్వులు పలువురు తలంచిరి. “హీనం దూషయతీతి హిందూః” అనువ్యుత్పత్తి మహామేరుతంత్రమునం దీయఁబడి యున్నది “హీనం చ దూష యత్యేవ హిందూరి త్యుచ్యతే ప్రియే” అను మేరుతంత్రమునందుఁ గలదు వాచస్పత్యాదులం దిది సంస్కృతపదముగానే తీసికొనఁబడి వ్యుత్పత్తి యీయఁబడి యున్నది కొందఱ కిది యన్యభాషాపదమనుతలం పుండవచ్చును. పలువుర కట్టితలంపు లేదు. కాఁబట్టి యిది యన్యభాషాపదముకాదు. “మూరురాయరగండాదులు” నామములలోఁ జేరఁదగినవియే యై యున్నవి.

పూర్వరచనానుకరణము:—ఈతనియందు గ్రంథచౌర్యదోష మొకటి మోపఁబడియున్నది. ఈమహాకవి శ్రీనాథుని గ్రంథములనుండియు, మారనకబ్బమునుండియుఁ బినవీరన్న పొత్తములనుండియుఁ గృష్ణదేవరాయనిపుస్తకమునుండియు మఱికొన్ని యితరగ్రంథములనుండియుఁ గొంతపదార్థసంగ్రహము చేసినమాట నిజము. తుదకు గోపాలునిరామకవి కవిత్వమునుండికూడఁ బెద్దనార్యుఁడు పదార్థసంగ్రహణము చేసినట్లు మనవారు వ్రాయుచున్నారు. ఇది చౌర్యమని కొందఱును, గాదని కొందఱును వాదించుచున్నారు. గ్రంథచౌర్యము గాదు కాని పెద్దయనుకరణము. ఇది మనసారస్వతముయొక్క గమనికను దెలుపునది గాన దీనింగూర్చి కొంత యిచ్చట వ్రాయవలసియున్నది.

మనవాఙ్మయము భాషాంతరీకరణముతోఁ బ్రారంభ మైనది. నన్నయాదు లీభాషాంతరీకరణమును గావించిరి. ఒకసంస్కృతగ్రంథమును బుచ్చుకొని దానిని దెలుంగులోనికి దింపుచువచ్చిరి. తరువాత ననుకరణము ప్రారంభ మైనది. అది పెద్దనాదులనాఁడు గలిగినది. వీరు పూర్వులవలె నొకసంస్కృత

గ్రంథమును దీసికొని తెలుఁగులోనికి వరుసగా దింపక యాయాపూర్వకవుల వ్రాఁతల ననుసరించి తమగ్రంథములఁ బూరించుకొనుచు వచ్చిరి. కొన్ని యెడల సందర్భానుసారముగాఁ బూర్వసంస్కృతగ్రంథములలోని శ్లోకములఁ దెనిఁగించి తమగ్రంథములలోఁ బెట్టుకొనుచువచ్చిరి. కొన్నియెడలఁ బూర్వపుటాంధ్రకవుల వ్రాఁతల ననుకరించుచువచ్చిరి. పెద్దన యిట్టియనుకరణము చాలఁ జేసినాఁడు. అగపడినవి క్రిందఁ జూపుచున్నాను. ఈక్రింద వ్రాయఁబోవునవి యన్నియు నిదివఱకు విమర్శకులు వ్రాసినవే కాని నేను క్రొత్తగా నెంచి తీసినవి కావు.

"త్ర్యంబకాచలకన్యకాంబుపూరంబున నఘమర్షణస్నానమాచరించి"

కాశీఖండము.

"సచ్ఛాత్రుఁ డగుచు నిచ్చలు నేఁగి యయ్యేట నఘమర్షణస్నానమాచరించి"

మనుచరిత్రము.

ఉ. "వానిఁ బ్రశంసచేయఁదగు వాఁడు కృతార్థతముండు వానిచే
నీనిఖిలంబు పావన మహీనకృపావిభవం బెలర్ప నె
వ్వాని గృహాంగణంబునకు వచ్చినత్రోన రజంబులందు నీ
మానితపాదయుగ్మక మనుస్ఫుఁ బ్రఫుల్లసరోజదామము న్." వైరాగ్యము.

ఉ. "వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మెన్నఁగా
వాని ధనంధ్యజీవనము వానిది జన్మము వేఱుసేయ కె
వ్వానిగృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల సంతసమందుచుఁ బోవు నిచ్చలున్." మనుచరిత్రము.

మ. "కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్
గమికగ్గీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్." నైషధము.

మ. "అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్." మనుచరిత్రము.

మూలములో వరూథినియే ప్రవరుని జూచిన ట్లీక్రిందిపద్యమున నున్నది.

చ. "అని కడువంతఁ గూరుచు హిమాద్రితటంబున సంచరించు వి
ప్రుని మకరాంకసన్నిభు వరూథిని నాఁ జనునొక్కయప్సరో

గస లలితాంగకాంతిజితకాంచనవిభ్రము చంచదబ్జలో
చన కలహంసయాన కని సంభ్రమసంచలితాంతరంగయై."

దీనిని మనకవి శ్రీనాథుని గమనికలోనికి దింపుటకై నయూధినిం బ్రవరుఁ జే
చూచినట్లు వర్ణించినాఁడు.

ఉ. "ఈసుకుమారుఁ డెవ్వఁడొకొ యిందుల కెందులనుండి వచ్చెనో
భాసురరూపకాంతిజిత భావజచంద్రుఁ డితండు రాగలీ
లాసరసత్వ మొప్పఁ గడులాలసుఁడై నను జూచె నేనినేఁ
జేసినపుణ్య మెవ్వరును జేయరు కాముని దక్క నేలుదున్." మార్కండేయ పు.

ఉ. "ఎక్కడివాఁడొ యక్షతనయేందువసంతజయంతకంతులం
జక్కఁదనంబునం గెలువఁజాలెడివాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ మెక్కడ యేలనిబంటుగా మరున్
దక్కఁగొనంగరాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్." మనుచరిత్రము.

సీ. "నలినసంభవు వాహనము వారువంబులు కులము సాములు మాకుఁ గువలయాక్షి
చదలేటిబంగారుజలరుహంబులతూండ్లు భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి
సత్యలోకము దాఁక సకలలోకంబులు నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మామాటలు వినంగ నమృతాంధసులు యోగ్యులనుప
భారతీదేవిముంజేతిచిలుకకు చిలుక, సమదగజయాన బ్రహ్మచారి మాకు [మాంగి
వేదశాస్త్రపురాణాది విద్యలెల్లఁ, దరుణి నీయాన ఘంటాపథంబు మాకు."

సీ. "చిన్నివెన్నెలకందు వెన్నుదన్నిసుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిఁబుట్టు జంత్రగాత్రముల రాల్గరఁగించు విమలగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపు మినుకు లావర్తించు పని వెన్నతోఁడఁ బెట్టినది మాకు
హయమేధరాజసూయములనఁ బేర్వడ్డ సవనతంత్రంబు లుంకువలు మాకు
గగనగసీమఁ గల్పవృక్షములనీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు, సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర."
మనుచరిత్రము.

ఇట్టి వనేకములు కలవు ఈతఁడు సంస్కృతకావ్యములనుండి యు వ్యాఖ్యానముల నుండియును గూడ నూహలఁ జాల దీసికొనినాఁడు.

శ్లో. "భజేమహే నిపీతైకం ముహురన్యం పయోధరమ్
మారంతం బాలమాలోక్య శ్వసంతా వాదిదంపతీ."